Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు   స్థాపితం: 1930   జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 7 • 15-2-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-







## జంట హత్యోదంతంతో

# నెల్లూరు నగరంలో భయోత్పాతం!



హత్యకు గురైన తల్లీ కూతుర్లు శకుంతల, భార్గవి.



హరనాథపురంలో దినకర్‌రెడ్డి ఇంటి వద్ద గుమిగూడిన జనం.

హరనాథపురంలో జరిగిన తల్లీ కూతుళ్ల హత్య నెల్లూరు నగరాన్ని గడగడ వణికించింది. పతనమైన మానవత్వపు విలువలకు ఇదొక దారుణమైన ఉదాహరణ. యువతరంలో అక్రమ సంపాదన మీద పెరుగుతున్న వ్యామోహానికి కూడా ఇదొక విషాదకర తార్కాణం.

హరనాథపురంలోని రెండవ వీధిలో, రామాలయం పక్కన దినకర్‌రెడ్డి అనే ఫార్మసీ కాలేజీ యజమాని నివసిస్తున్నాడు. ముత్తుకూరు రోడ్డులోని బ్రహ్మదేవం గ్రామంలో ఆయనకొక ఫార్మసీ కాలేజీ వుంది. మరొక కాలేజీలో ప్రిన్సిపల్‌గా కూడా పని చేస్తున్నాడు. తన స్వంత కాలేజీ బాగా నడుస్తుండడంతో కొంత స్థితిమంతుడైనాడు. దానితో ఒక ఇల్లు కట్టుకొన్నాడు. దాని ఇంటీరియర్ పనులను ఇంతియాజ్ అనే యువకుడికి అప్ప చెప్పాడట. కాలేజీకి సంబంధించిన పనులు కూడా అతడి చేత చేయించేవాడట. ఇంటీరియర్ పనుల కోసం ఇంట్లోని ప్రతి గదినీ తిరిగి చూసే అవకాశం కల్గిన ఇంతియాజ్‌కు వారి సంపద మీద కన్ను పడింది. ఇంట్లో ఎప్పుడూ ఎంతో కొంత బంగారు, డబ్బు వుండడం గమనించి, దాన్ని తస్కరించాలనే పథకం పన్నాడు. అందుక ఇద్దరు స్నేహితులను తోడుగా తీసుకొన్నాడు. గత ఆరు నెలల నుంచి వీరు ముగ్గురూ కలిసి ఇంట్లోని పరిస్థితులను అంచనా వేస్తూ వచ్చారట. ఉదయం 11 గంటల సమయంలో అయితే ఇంట్లో దినకర్‌రెడ్డి భార్య శకుంతల ఒక్కటే వుంటుందని గమనించారు. దోచుకోవడానికి ఆ సమయాన్ని ఎంచుకొన్నారు. ముగ్గురూ కలిసి ఒక మోటార్ సైకిల్ మీద వచ్చి తలుపులు తట్టారు. తలుపు తీయగానే శకుంతల మీద దాడి చేసి, నోరు మూయించి, దోపిడీ చేసి, గుట్టుగా వెళ్లిపోవాలన్నది పథకం.

## ప్లాన్ ఫెయిల్!

అయితే వారు వూహించని విధంగా ఇంటి లోపల దినకర్‌రెడ్డి కుమార్తె కన్పించడంతో కొంత గందరగోళానికి గురైనారు. వారి దురుద్దేశాన్ని గ్రహించలేని శకుంతల ఎందుకొచ్చారని అడిగి, తెలిసినవారు కావడంతో టీ తెచ్చి ఇస్తానని చెప్పి లోపలకు వెళ్లిందట. దినకర్‌రెడ్డి కుమార్తె భార్గవి, తన తండ్రికి ఫోన్ చేసి ఇంతియాజ్ వచ్చిన విషయం చెప్పి, ఆయన చేత వారితో మాట్లాడించి, తన గదిలోకి వెళ్లిపోయిందట. ఇంటీరియర్ పనులకు సంబంధించిన ఒక డిజైన్ కాగితం కోసం వచ్చానని చెప్పడంతో ఇంతియాజ్‌ను ఎవరూ అనుమానించలేదు. భార్గవి గదిలోకి వెళ్లగానే వీరు ముగ్గురూ కలిసి వంట ఇంట్లో వున్న శకుంతల మీద దాడి చేసి, ఆమెను విచక్షణా రహితంగా పొడిచి చంపేశారు. ఆ అలికిడికి గది నుంచి బయటకు వచ్చిన భార్గవి గొంతు నులిమి చంపారు. వారిద్దరి ఒంటి మీదున్న బంగారు నగలు, బీరువా

కొరవ 14వ పేజీలో



# దాని రీతి అవినీతి!

కేంద్ర ప్రభుత్వంలో మరొక భారీ అవినీతి కుంభకోణం బయటకు వచ్చింది. ప్రధాని, రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి వంటి ప్రముఖుల ప్రయాణం కోసం ఉపయోగించే హెలికాప్టర్ల కొనుగోలులో దాదాపు 400 కోట్ల రూపాయల లంచం చేతులు మారిందని ఇటలీ దేశం పోలీసులు వెల్లడించారు. దేశ ప్రతిష్టను, మన రక్షణ రంగ విశ్వసనీయతను దారుణంగా దెబ్బ తీస్తున్న కుంభకోణం ఇది.

2003లో జార్జి ఫెర్నాండెజ్ రక్షణ మంత్రిగా వున్న సమయంలో ఈ హెలికాప్టర్ల కొనుగోలు అంశం తెర మీదకు వచ్చింది. ప్రముఖుల భద్రత, సౌకర్యాలకు అనుగుణమైన వాహనాలు సమకూర్చుకోవాలని తలపెట్టి, టెండర్లు పిలిచారు. ఆ ప్రక్రియ దాదాపు ఏడేళ్లు నడిచి, 2010లో ఇటలీకి చెందిన ఫిన్ మెచెనికా అనే సంస్థ నుంచి 12 హెలికాప్టర్లు కొనాలని నిర్ణయించారు. మన దేశంలో విస్తృతంగా వాడుకలో వున్న అగస్టా వెస్ట్‌ల్యాండ్ హెలికాప్టర్లకు ఈ సంస్థ ఉత్పత్తిదారు. ఇది ఇటలీ ప్రభుత్వ రంగ సంస్థ. ఆ దేశంలో ఫియట్ కంపెనీ తర్వాత అతిపెద్ద సంస్థ ఇదే. ఇటలీ చట్టాల ప్రకారం లంచం పుచ్చుకోవడంతో పాటు ఇవ్వడం కూడా నేరమే. అక్కడి స్థానిక పత్రికలు ఈ వ్యవహారంలో లంచం చేతులు మారిందనే వార్తలు ప్రచురించాయి. దానిపై దర్యాప్తు జరిపిన ఇటలీ పోలీసులు ప్రాథమిక సాక్ష్యాలున్నాయనే అవగాహనకు వచ్చి, ఆ కంపెనీ ప్రధాన అధికారిని అరెస్టు చేసి, జైలుకు పంపారు. అక్కడి కోర్టుకు వారిచ్చిన నివేదికలో, భారత వైమానిక దళాధిపతిగా పని చేసిన ఒక ఉన్నతాధికారి సోదరులు ముగ్గురు ఈ లంచం తీసుకొన్నారని విన్నవించారు. ఆ ఉన్నతాధికారి – మాజీ ఎయిర్ చీఫ్ మార్షల్ ఎస్పీ త్యాగి. ఆయన 2007లోనే రిటైరయ్యారు. అయితే ఈ కంపెనీకి టెండర్ దక్కడానికి అనుకూలంగా షరతులను మార్చడంలో ఆయన కీలకపాత్ర పోషించాడని, ఆయన దాయాది తమ్ముళ్ల ఒత్తిడి మేరకే జరిగిందని, ఆ కంపెనీ తరఫున దళారిగా పని చేసిన వ్యక్తితో ఎస్పీ త్యాగి నేరుగా ఒక సమావేశం జరిపాడని, లంచాన్ని చాలా తెలివిగా ఒక సాఫ్ట్‌వేర్ కాంట్రాక్ట్ రూపంలో భారతదేశానికి బదలీ చేశారని ఇటలీ పోలీసులు నిర్ధారణకు వచ్చారు. నేను దళారిని కలిసిన మాట నిజమే కానీ, లంచం తీసుకోలేదని వాదిస్తున్నాడు ఎస్పీ త్యాగి. తాటి చెట్టు క్రింద కూర్చుని పాలు త్రాగినా కల్లు త్రాగారనే భావిస్తారన్న నిజాన్ని మర్చిపోయినట్లున్నాడాయన. రక్షణ శాఖలో, అదీ ఎంతో బాధ్యతాయుతమైన చీఫ్ ఎయిర్ మార్షల్ వంటి ఉన్నత స్థానంలో వున్న వ్యక్తి నీతిగా వుండడం కాదు, నీతిగా వున్నట్లు ఎప్పటికప్పుడు రుజువు చేసుకోవాల్సిన అవసరం వుంటుంది. తన తమ్ముడి స్నేహితుడు కాబట్టి దళారిని కలిశానని చెప్పడం సమర్థనీయం కాదు. సైన్యాధిపతులు దళారులతో విందులు, వినోదాలు చేయడం దేశ ద్రోహంతో సమానం.

కేంద్రంలో యుపిఏ ప్రభుత్వం వచ్చిననాటి నుంచి అవినీతి ఒక రీతిగా మారిపోయింది. ఈ తొమ్మిదేళ్ల పాలనలో ఎన్ని కుంభకోణాలో చెప్పలేము. ప్రపంచం దృష్టికి వచ్చినవే పదుల సంఖ్యలో వున్నాయి. బయటకు రానివి ఇంకెన్ని వున్నాయో తెలియదు. 2జి కుంభకోణం వంటి వాటి విషయంలో మిత్రపక్షాల మీదకు నేరం నెట్టివేసి తప్పించుకొన్నాడు ప్రధానమంత్రి. కానీ రక్షణ శాఖ మొదటి నుంచీ కాంగ్రెస్ మంత్రుల నేతృత్వంలోనే వుంది. ఆ శాఖలో అవినీతి జరిగిందని పరాయి దేశం వెల్లడించే వరకు మౌనంగా వుండిపోవడం దేనికి సూచన? అందరూ శ్రీవైష్ణవులే, బుట్టలోని చేపలు మాత్రం మాయమై పోయాయన్న సామెతగా, ప్రధాని, రక్షణ మంత్రి నిప్పుతో సమానమైన నిజాయితీ పరులైనప్పటికీ ప్రభుత్వంలో అవినీతి దోపిడీ మాత్రం యధేచ్ఛగా కొనసాగిపోతూనే వుంది. ఏ ఒక్క కుంభకోణానికి కూడా ఇప్పటి వరకు మంత్రుల స్థాయిలో నైతిక బాధ్యత తీసుకొన్నవారు లేరు. ఒక్క దోషిని కూడా శిక్షించిన దాఖలా లేదు. సుప్రీంకోర్టు జోక్యం చేసుకొన్న 2జి కుంభకోణం, కోల్ గేట్ గోల్మాల్ వంటి నేరాలలో కూడా ప్రభుత్వం విచారణను వెనక్కు నెడుతున్నదే తప్ప నిజాయితీగా నిందితులను విచారించే ప్రయత్నం చేయడం లేదు. ఒక్క మాటలో చెప్పాలంటే ఏదో ఒక నెపంతో అవినీతిపరులను పదిలంగా కాపాడుతున్నది కేంద్ర ప్రభుత్వం. ఈ ధోరణి ప్రజలను వంచించడం క్రిందకే వస్తుంది. ప్రజలను మోసం చేసేది ఎప్పటికీ ప్రజా ప్రభుత్వం కానేరదు.

## జనవాణి

### ఆయిల్ కంపెనీల ఆగడాలు!

ఆయిల్ కంపెనీలు రోజుకో రూలు పెడుతూ పెట్రోల్, డీజిల్, గ్యాస్ ధరలు పెంచుతూ ప్రజలను వేపుకతింటున్నాయి. అసలు ఎవరైన కాగ్ సంస్థలో సరైన అధికారి ఈ కంపెనీల కార్యకలాపాలను నిశితంగా పరిశీలిస్తే వాటి భాగోతం బయటపడుతుంది. వాస్తవానికి ఆయిల్ కంపెనీలు నష్టాలలో నడుస్తున్నాయా? వారు చేస్తున్న ఖర్చెంత? వారికి వస్తున్న ఆదాయమెంత?? ఈ వ్యవహారాలపై దేశంలో నిశిత పరిశీలన లేదు. ప్రభుత్వమే కట్టెల పొయ్యిలు వాడుతున్న వారిని బలవంతంగా మాన్పించి గ్యాస్ సిలిండర్లపై వంటకు మళ్లేలా చేసింది. ఇప్పుడేమో రోజుకో రూలుతో సిలిండర్ల కనెక్షన్లు లాగి వేయాలని చూస్తుంది. ఇప్పుడు సరికొత్తగా ఆధార్‌కార్డులుంటేనే గ్యాస్ సిలిండర్లు ఇస్తామన్న గందరగోళానికి ఆయిల్ కంపెనీలే కారణమౌతున్నాయంటే ప్రభుత్వం ఎంత బలహీన పడినట్లు?

పి.కృష్ణారెడ్డి — నెల్లూరు

### ఇవేం ప్రకటనలు!

ఇటీవల కొన్ని టీవీ ఛానళ్లలో ఫలానా కులం వారికే ఇళ్లప్లాట్లు అమ్ముతాము. అదీ వంద వాయిదాలలో సొమ్ము చెల్లించవచ్చనే ప్రకటనలు చూస్తున్నాము. ఈ ప్రకటనలు చూస్తుంటే అక్బరుద్దీన్ ఒవైసీ వ్యాఖ్యలకు, ఈ ప్రకటనలకు పెద్ద తేడా లేదనిపిస్తుంది. అపార్ట్‌మెంట్లు, ఇళ్లు కొన్ని కులాలకని ప్రత్యేకిస్తే సమాజంలో మళ్లీ అంతరాలు తప్పవు. ఇప్పటికే ఈ అంతరాల వల్ల సమాజం భ్రష్టుపట్టినందువల్ల ప్రభుత్వం ఈ వ్యవహారాన్ని పరిశీలిస్తే బాగుంటుంది.

టి.కోటేశ్వరరావు — కోవూరు

### ఇబ్బంది పడుతున్న టైలర్లు!

టైలరింగ్ వృత్తిలో వుండి జీవించేవారు రకరకాల సమస్యలతో సతమతమవుతున్నారు. విద్యుత్ ఛార్జీలు పెంచడంతోపాటు విపరీతంగా సర్‌ఛార్జీలు విధించడం వృత్తి రీత్యా టైలర్లకు కష్టంగా పరిణమించింది. టైలర్లు బడుగు, బలహీన వర్గాల క్రిందకు వస్తారు కాబట్టి వారికి ఇళ్ల స్థలాలు కేటాయించాలి. టైలర్ల వివరాలు సేకరించి వారికి ఇఎస్ఐ హాస్పిటళ్లలో ఉచిత వైద్యం అందించేలా కార్మికశాఖ తగిన చర్యలు తీసుకోమనవి.

షేక్.మస్తాన్‌వలి — నెల్లూరు

### విడవలూరు గ్రంథాలయం

మండల కేంద్రం విడవలూరులోని గ్రంథాలయాన్ని సరిగ్గా తీయడం లేదు. దీనివల్ల గ్రామస్తుల తోపాటు డిగ్రీ, జూనియర్ కాలేజీలు, హైస్కూళ్లలోని విద్యార్థులు రకరకాల సమాచారం తెలుసుకొనే అవకాశం లేక ఇబ్బంది పడుతున్నారు.

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

19-2-1943
పేజీలు : 4 వెల: 0-1-0

### సత్యపాలన దీక్షా మహోజ్వలనము!

గాంధీ మహాత్ముని హృదయ వేదన నుండి త్యాగ దీపిత సత్య తపోగ్ని నేడు మరల ప్రజ్వలిత మగుచున్నది.

యింతవరకు గాంధీజీ ఉపవాస వ్రతాలు ఫలాపేక్షతో కళంకితమై ఉండినవి. కానీ నేటి కఠోర ప్రాయోపవేశన వ్రతము పవిత్రమైన దివ్యులకే అతీతమైన ఒక ఘనతలా దేశ ప్రకాశితముగ – సచ్ఛీలానికి ఆపాదించిన అపనిందా కజ్జల రేఖను తొలగించి, విశాల భూలోకంలో తన నిష్కళంక ఆశయాలను – తాను పెంచి పెద్దజేసిన కాంగ్రెస్ సంస్థ యశోచంద్రికలను వ్యాపింపజేయనే ఈ నిరసన దీక్షను బూనుటచే యిది ఘన తరము.

ఒక అపనిందను బాపుకొను, తన స్వచ్ఛ మనస్సరణిని ఒక భూతలాధికారము శంకించినందుకు గాంధీ మహాత్ముడు 21 దినాల ఉపవాసాన్ని సాగిస్తున్నాడంటే రాపడిపోని హైందవుడుండడు. ఉప్పొంగిపోని దేశారాధకుడుండడు.

*–జమీన్‌రైతు సంపాదకీయం నుంచి*

### గాంధీజీ ఆరోగ్యం

గాంధీజీ ఆరోగ్యం గూర్చి ఆర్గురు డాక్టర్ల సంతకంతో 18వ తేదీన వెలువడిన ప్రకటనలో 'ఉరేమియా' ఎక్కువౌతున్నదని, హృదయ బలహీనత అధికంగా ఉన్నదని, ఆదుర్దా అధికమవుతున్నదని ఉంది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

15-2-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### పెద్దాస్పత్రి

హాస్పిటల్ భవనాల శంకుస్థాపన సందర్భంలో ముఖ్యమంత్రి సంజీవరెడ్డి గారి ఉపన్యాసంలోని సరసమైన, సౌమ్యమైన మాటలను బట్టి దొడ్ల సుబ్బారెడ్డి గారిచ్చిన మూడు లక్షలు తప్ప, ప్రభుత్వం దీని నిర్మాణానికి చిల్లి గవ్వ కేటాయించదేమోననే అభిప్రాయం అందరిలో కలుగకపోలేదు. దాతలో గూడా అలాంటి నిస్పృహే కలిగింది.

కానీ ఏ.సి.సుబ్బారెడ్డి గారు ఈ మూడు లక్షలుగాక, ప్రస్తుతం ప్రభుత్వం గూడా మరొక నాలుగు లక్షలు కేటాయిస్తుందని, ఈ ఏడు లక్షలతో పని జరుగుతుంటే, ఏటా కొంత కేటాయింపు సాధించి మూడవ ప్రణాళికా కాలంలోనే భవనాలు పూర్తి అగునట్లు చూడగలమని చెప్పినట్లు తెలుస్తున్నది.

ఏ.సి.సుబ్బారెడ్డి గారు ఆనాటి సభలో గూడా ఈ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఈ హాస్పిటలుకు అయ్యే 22 లక్షలలో భవనాలకు సుమారు 13 లక్షలు ఖర్చు కాగలదని, తక్కినది హాస్పిటలు పరికరాలకు ఉద్దేశింపబడినదని, అందువల్ల భవన నిర్మాణం కుంటుపడకుండా జరిగి పోవచ్చునని ఆశింపబడుతున్నది.

ఏమైనా యిది సుబ్బారెడ్డి గారి వ్యక్తిగత శ్రద్ధ మీద ఆధారపడి ఉంటుందనేది వేరుగా చెప్పవలసిన అవసరం లేదు. వారు ప్రస్తుతం మూడు లక్షలిచ్చిన దాత గూడా. దానికి విముఖులు గారు.

ఎట్లయినా హాస్పిటల్ పని నిర్విఘ్నంగా కొనసాగడం మనకు కావలసింది.

# నెల్లూరు ముచ్చట్లు

## అఫ్జల్ గురుకు శిక్ష వేసింది నెల్లూరీయుడే!

పార్లమెంటు దాడి కేసులో దోషి అఫ్జల్ గురుకు ఈ వారంలో ఉరిశిక్ష వేయడం దేశం దృష్టిని ఆకర్షించింది. ఈ వార్తాంశంతో నెల్లూరుకు సంబంధముండడం విశేషం. అఫ్జల్ గురుకు ఉరిశిక్ష విధిస్తూ 2005 ఆగష్టు 4వ తేది తీర్పు చెప్పిన సుప్రీం కోర్టు జడ్జీలలో ఒకరు నెల్లూరీయుడైన పొణకా వెంకట్రామిరెడ్డి కావడం విశేషం. ఇటీవల వరకు జస్టిస్ పొణకా వెంకట్రామిరెడ్డి ఇండియన్ లా కమిషన్ ఛైర్మన్‌గా వ్యవహరిస్తూ ఇటీవలే పదవీ విరమణ పొందారు. వెంకట్రామిరెడ్డి స్వగ్రామం అల్లూరు.

## ఊతకర్ర సాయంతో నడుస్తున్న వివేకా!

అనారోగ్యానికి గురై హైదరాబాద్‌లో విశ్రాంతి తీసుకొంటున్న నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఇటీవలవరకు కుర్చీలోనే కూర్చొని కోలుకొంటూ ఉండేవారు. గత వారం రోజులుగా డాక్టర్లు ఇచ్చిన ఊత కర్ర సహాయంతో నడుస్తున్నట్లు విశ్వసనీయ వర్గాల ద్వారా తెలిసింది.

## ఎన్‌కౌంటర్‌కు యత్నం?

నెల్లూరు హరనాధపురం రెండవ వీధిలో ఒక పథకం ప్రకారం తల్లీ కూతుళ్లు శకుంతలమ్మ, భార్గవిలను హతమార్చిన నిందితులు ఇంతియాజ్, వంశీకృష్ణ, మురళీ మనోజ్‌కుమార్‌ను ఎన్‌కౌంటర్ చేయాలని పోలీసులు తొలుత భావించారు. కానీ మానవ హక్కుల సంఘం, కోర్టుల వల్ల వచ్చే ఇబ్బందిని దృష్టిలో పెట్టుకొని ఈ ప్రయత్నాన్ని విరమించుకొన్నట్లు తెలిసింది. నిందితులను జనానికి వదిలేసినా తీవ్ర విమర్శ వస్తుందని భావించి వెనక్కి తగ్గారు. ఇన్ని జాగ్రత్తలు తీసుకొని తమ డ్యూటీ తాము చేసినా ఈ ఘటన తర్వాత పోలీసులు జనం చేత తీవ్రంగా తిట్లు తిన్నారు.

## స్వగ్రామ సేవలో సిఎం మామ!

ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి మామ రమణారెడ్డి అల్లూరు రామకృష్ణా జూనియర్ కాలేజీలో పదవ తరగతి వరకు చదువుకొన్నారు. వ్యాపార రంగంలో ఎంతో ఎత్తుకు ఎదిగిన ఆయన వృద్ధాప్యంలోనూ చురుకుగా ఉంటూ స్వగ్రామానికి ఏదో ఒక మంచి పని చేయాలని తలపోశారు. గ్రామస్తుల సలహా మేరకు నెల్లూరు బోడిగాడితోటలో రోటరీ సంస్థ కట్టించిన అత్యాధునిక మరుభూమిని పోలిన సరికొత్త మరుభూమి పనులను అల్లూరు పేటలో 20 లక్షల రూపాయలకు పైగా వెచ్చించి చేపడుతున్నారాయన. ఈ నెలలోనే ఆ పనులు పూర్తి చేయాలన్న తలంపుతో ఈ వారంలో నెల్లూరుకు వచ్చారాయన. అల్లుడు సిఎంకు చెప్పి స్వగ్రామంలో తాగు నీటి సమస్య పరిష్కారానికి ఆయన ప్రత్యేక నిధులు మంజూరు చేయిస్తే అల్లూరీయుడిగా రమణారెడ్డి పేరు చిరస్థాయిగా నిలిచి పోతుంది.

## కొరమేను @ 450!

నెల్లూరు కొరమేను చేపల పులుసుకు దేశవ్యాప్తంగా పేరుంది. ఏడాది క్రితం వరకు కొరమేను చేపల రేటు నెల్లూరీయులకు అందుబాటులోనే ఉండేది. ఈ యేడాది విపరీతంగా పెరిగిన ఈ చేపల రేటు 10వ తేది ఏకంగా 450 రూపాయలకు చేరుకొంది. కొరమేను చేపలను మార్కెట్‌లో చూడడమే గానీ కొని తినే పరిస్థితి లేదు సామాన్య మధ్యతరగతీయులకు.

## బెండ బిర్రు!

నెల్లూరీయులు ఇష్టంగా తినే కూరగాయల్లో వంకాయలు, బెండకాయలు ప్రథమ, ద్వితీయ స్థానాల్లో ఉంటాయి. బెండ కాపు తగ్గడం మార్కెట్‌లో బాగా డిమాండ్ ఉండడంతో గత మాసం రోజులుగా ఏ రోజు కూడా బెండకాయలు కిలో 30 రూపాయలకు తగ్గకుండా ఏ.సి కూరగాయల మార్కెట్ లోపలా బయట నిలకడ ధర మీద అమ్ముతున్నారు. లేత బెండకాయలైతే 40 రూపాయలు సైతం వసూలు చేస్తున్నారు.

## వందలాది పెళ్లిళ్లు!

13, 14, 15 తేదీల తర్వాత మరో రెండు నెలల వరకు మంచి ముహూర్తాలు లేకపోవడంతో నెల్లూరు నగరంలో ఈ మూడు రోజుల్లో వందలాది పెళ్లిళ్లు జరిగాయి. కళ్యాణ మండపాలు, కమ్యూనిటీ హాళ్లు, చివరికి టౌన్‌హాలు కూడా ఖాళీ లేకుండా పెళ్లిళ్లు జరిగాయి. క్యాటరింగ్, హోటళ్లు, హైరర్స్, పూల డెకరేషన్స్, మేళగాళ్లు మహా దర్జాగా పెళ్లింటి వారిని డిమాండ్ సాకుతో దోచేశారు.

## భయంలేని దొంగలు

నెల్లూరులో దొంగలకు పోలీసు లంటే భయం లేకుండా పోయింది. వేళాపాళా లేకుండా రకరకాలుగా దోచేస్తున్నారు. 11వ తేది సాయంత్రం పొదలకూరు బస్టాండ్‌లో 46 సవర్ల నగలు పర్స్‌లో పెట్టుకొని బంధువుల ఇంట గృహ ప్రవేశానికి నగరంలోని డైకస్ రోడ్డులో ఆర్టీసి బస్సు దిగిన తిరుపతమ్మ తన పర్సు బస్సులోనే మాయం కావడంతో లబోదిబోమంటూ ఐదవ పట్టణ పోలీస్ స్టేషన్‌కు ఫిర్యాదు ఇవ్వను పరుగెత్తింది. ఈ ఘటన గూర్చి విని నెల్లూరీయులు తేరుకోక మునుపే హరనాధపురం రెండవ వీధిలో పిడతాపోలూరులో ఫార్మసీ కళాశాల నడుపుతున్న దినకర్‌రెడ్డి ఇంట్లో ముగ్గురు యువకులు చొరబడి ఆయన భార్య, కుమార్తెను పాశవికంగా చంపడం నగర ప్రజలను ఉలిక్కి పడేలా చేసింది.

నగరంలో జరుగుతున్న చోరీలను అరికట్టాలని 9వ తేది నగర డిఎస్పీ వెంకటనాథ్‌రెడ్డి తన కార్యాలయంలో నగర సిఐలు, ఎస్‌ఐలతో సమావేశమై సూచనలిచ్చారు. ఉన్నతాధికారులు సూచనలను క్రిందిస్థాయి అధికారులు వినీవిననట్లున్నారు. గస్తీ, నిఘా, నాకా బందీలు మరచిపోయి పోలీసులు డ్యూటీలు చేస్తుండడంతో నగరంలో దొంగలు ఇష్టా రీతిన దోచుకొంటున్నారు. దొంగతనాలను అరికట్టలేని పోలీసులు నగరంలో వందలాది మంది ఉంటే ఏమి? లేకుంటే ఏమి అన్నంతగా ప్రజల్లో పరువు పోగొట్టుకొన్న వారిలో దొంగలను పట్టుకొనే రోషం మాత్రం రావడం లేదు.

## రంగడి బంగారు గరుడసేవ

నెల్లూరీయుల ఆరాధ్య దైవం

కొరవ 14వ పేజీలో





ఉత్తరక్రియలు

మా తండ్రిగారైన శ్రీ చుండి హరగోపాల్ గారు తేది 6-2-2013న బుధవారం స్వర్గస్తులైనారు.

15-2-2013 - దశహస్సు
16-2-2013 - షోడశం
17-2-2013 - సపిండీ కరణం
18-2-2013 - వైకుంఠ సమారాధన

నెల్లూరు నవలాకుల గార్డెన్, 4వ మైలు సెంటరు నందుగల మా స్వగృహమునందు జరుపబడును.

జననం 2-6-1943 మరణం 6-2-2013
కీ॥శే॥ చుండి హరగోపాల్ Rtd. HM

కుమారుడు: చుండి వెంకట రాంప్రసాద్
సెల్: 92900 18777

# కంట్రీ వెకేషన్స్!

● నెల్లూరులోనూ నిర్వాహకునిపై ఫిర్యాదు



నెల్లూరులో మూతబడిన కంట్రీ వెకేషన్స్ కార్యాలయం.

విహార యాత్రల పేరుతో ప్రజలను నమ్మించి వంచించిన ఓ సంస్థ వ్యవహారం బట్టబయలైంది. కొన్నేళ్ల క్రిందట కరెంట్ ఆఫీస్ సెంటర్‌లో కంట్రీ వెకేషన్స్ పేరిట ఒక సంస్థ ఏర్పాటైంది. దేశవిదేశాల్లో విహార యాత్రలకు తమ కంపెనీ తరపున తక్కువ ఖర్చుతో పంపుతామని వసతి సౌకర్యాలు కల్పిస్తామని చెప్పి పలువురిని మోసగించడంతో ఇటీవల బాధితులు ఈ సంస్థ కార్యాలయం ఎదుట ఆందోళనకు దిగడంతోపాటు పోలీసులకు ఫిర్యాదు చేయడంతో వీరి మోసం బయటపడింది. వాస్తవానికి ఈ సంస్థపై ఏడెనిమిదేళ్ల క్రిందటే స్టోన్ హౌస్‌పేటకు చెందిన కొందరు వ్యాపారులు పోలీసులకు ఫిర్యాదు చేసినా సరిగా స్పందించక పోవడంతో వీరి మోసాలకు అంతే లేకుండా పోయింది. పార్కులు, షాపింగ్‌మాల్స్‌లో లక్కీడ్రా బాక్స్‌లు ఏర్పాటుచేసి అక్కడకు వచ్చిన వారి నుండి వివరాలు తీసుకుని మీకు గిఫ్ట్ వచ్చిందని ఫోన్ చేస్తారట. బిజీగా ఉండే వ్యాపారస్తుల ఫోన్ నెంబర్లు సేకరించి వారికి ఫోన్‌చేసి తీయగా మాటలు చెప్తారట. ఎప్పుడూ వ్యాపారం, డబ్బు సంపాదనేనా కుటుంబసభ్యులతో విహార యాత్రలకు వెళ్తేనే కదా ఆనందం కలిగేదని చెప్పి కుటుంబ మహిళలను, మగ వారిని ముగ్గులోకి దించుతారట. స్థానికంగా ఉండే కార్యాలయానికి పిలిపించి కౌన్సిలింగ్ తరహాలో బ్రెయిన్‌వాష్ చేసి వారిని తమకు అనుకూలంగా ఒప్పిస్తారు. తక్కువ ఖర్చుతో దేశ, విదేశాలలో విహారయాత్రలకు అన్ని వసతి సౌకర్యాలు కల్పిస్తామని చెప్పి డబ్బులు వసూలు చేసుకొన్న తరువాత ఆయా ప్రాంతాల్లో సరైన సదుపాయాలు కల్పించకుండా వదలి వేయడంతో పలువురు వీరి బారినపడి మోసపోయారు. ఇదే మోసం 2005 సంవత్సరంలో జరుగగా ఆందోళన చేసి కార్యాలయం అద్దాలు పగులగొట్టి ఫిఫ్త్‌టౌన్‌లో ఫిర్యాదు చేశారు కొందరు. అప్పుడు పోలీసులు ఎలాంటి చర్యలు చేపట్టిన దాఖలాలు లేవు. తిరిగి తాజాగా పలువురు నగరానికి చెందిన వారు విదేశీ విహార యాత్రలతో పాటు ఆ సంస్థకు చెందిన వెంచర్లలో ఇళ్ల ఫ్లాట్లు కొనుగోలు చేసి మోసపోయారు. వీరు నిర్వాహకులను నిలదీస్తే నిర్లక్ష్యంగా సమాధానం ఇవ్వడంతో వారంతా నగర డిఎస్పీ వెంకటనాథ్‌రెడ్డికి ఫిర్యాదు చేశారు. కంట్రీవెకేషన్స్ సంస్థ ఎమ్డీ రాజీవ్‌రెడ్డి అని, ఆయన్ను పిలిపించి విచారించి బాధితులకు న్యాయం చేస్తామన్నారు. కడపకు చెందిన ఈ రాజీవ్‌రెడ్డికి ఒక పార్టీకి చెందిన నేతలతో దగ్గరి బంధుత్వం ఉండడంతో ఆయనపై చర్యలు చేపట్టే వ్యవహారంపై పలు అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి.



# పన్నులు చెల్లించని ప్రభుత్వ కార్యాలయాలు!

● కలక్టరేట్, పోలీసాఫీసులే పెద్ద మొత్తాల్లో బకాయి.

నగర పాలక సంస్థకు పన్నుల బకాయిలు గుదిబండల్లా మారుతున్నాయి. పట్టణ పరిధిలో ప్రైవేట్, ప్రభుత్వ కార్యాలయాల నుంచి రావాల్సిన పన్నులు సకాలంలో చెల్లింపు జరగకపోవడం, బకాయిలు కోట్లలో పేరుకు పోతుండడంతో నగర పాలక సంస్థకు ఊపిరాడని పరిస్థితి ఏర్పడుతోంది. సాధారణ ప్రజల నుంచి వివిధ పన్నులను ముక్కుపిండి వసూలు చేసే కార్పొరేషన్ సిబ్బంది ప్రభుత్వ కార్యాలయాల నుంచి పన్నులు వసూలు చేయలేక చతికిల బడుతున్నారు. ఏ ప్రభుత్వ కార్యాలయమైనా ఆస్తి పన్ను పరిధిలోకి వస్తుంది. కొన్నేళ్లుగా నగరంలో గల వివిధ శాఖల ప్రభుత్వ కార్యాలయాలు ఆస్తి పన్ను చెల్లించక పోవడంతో బకాయిలు కోట్ల రూపాయల్లో పేరుకుపోయాయి. కలెక్టర్ కార్యాలయం, పోలీస్ శాఖ, విద్యుత్ శాఖ, జీవిత బీమా సంస్థ, ఆర్‌డిఓ కార్యాలయం, టెలిఫోన్ శాఖ, ఆర్టీసి తదితర శాఖలు చాన్నాళ్లుగా ఆస్తి పన్ను చెల్లించక పోవడంతో దాదాపు ఎనిమిది కోట్ల రూపాయల బకాయిలు పేరుకుపోయాయి. దాదాపు వందకు పైగా వివిధ శాఖలు పన్ను బకాయిలు ఉన్నాయి. వీటిలో అత్యధికంగా పోలీస్ శాఖ కార్పొరేషన్‌కు 30 లక్షల రూపాయలు బకాయిలు పడి ఉంది. దీని తర్వాత కలెక్టర్ కార్యాలయం 27 లక్షలు, ఆర్‌డిఓ కార్యాలయం 12 లక్షలు, విద్యుత్ శాఖ దాదాపు 9 లక్షలు బకాయిలు పడి ఉంది. ఇందులో విశేషమేమిటంటే మునిసిపాలిటీ విద్యుత్ శాఖకు బకాయి ఉంటే కరెంటు సరఫరా నిలిపి వేయడం చాలా సందర్భాల్లో జరిగింది. అలాంటి విద్యుత్ శాఖ మునిసిపాలిటీకి చెల్లించాల్సిన పన్నులు సకాలంలో చెల్లించలేక పోతోంది. బకాయిలు వడ్డీతో కలిపి తొమ్మిది కోట్లకు చేరుకొన్నా, పలుమార్లు కార్పొరేషన్ అధికారులు నోటీసులు పంపినా బడ్జెట్ లేదని చెప్తుండడంతో అధికారులు తలలు పట్టుకొంటున్నారు. వివిధ అభివృద్ధి పనులకు ఈ పన్ను మొత్తాలను ఖర్చుచేసే నగర పాలక శాఖకు ఈ బకాయిల కారణంగా సమస్యలు తలెత్తుతున్నాయి. ప్రభుత్వ కార్యాలయంలో పన్నులు బకాయిలుండడంతో దిక్కుతోచని పరిస్థితిని ఎదుర్కొంటుంది కార్పొరేషన్.

# రవాణాశాఖలో త్రీటైర్ విధానంతో తిప్పలు!

## పక్షం రోజులుగా నిలచిపోయిన పనులు!



నెల్లూరు ఆర్టీఏ కార్యాలయం వద్ద జనం పడిగాపులు.

వాహనదారుల సౌలభ్యం కోసం, దొంగ వాహనాలకు నకిలీ పత్రాలు సృష్టించి అక్రమంగా తిరిగే వాహనాలను అడ్డుకునేందుకు రవాణా శాఖ త్రీ టైర్ విధానాన్ని ప్రవేశ పెట్టింది. ఈ నూతన విధానం ద్వారా ఆన్‌లైన్ వ్యవస్థను అనుసంధానం చేశారు. కొత్తగా సాఫ్ట్‌వేర్‌ను ఏర్పాటు చేశారు. అందుకోసం జనవరి నెలలో రెండు మూడు రోజులు రవాణా శాఖ కార్యకలాపాలు నిలిపి వేశారు. ఇంతవరకు బాగానే ఉన్నా నూతన విధానం, కొత్త సాఫ్ట్‌వేర్ వినియోగంలో సిబ్బందికి తగిన శిక్షణ ఇవ్వక పోవడంతో, వారికి అవగాహన కల్పించక పోవడంతో ఆర్టీఓ కార్యాలయంకు వచ్చే వారికి ఇబ్బందులు ఎదురౌతున్నాయి. ఎల్ ఎల్‌ఆర్, డ్రైవింగ్ లైసెన్సు పొందేందుకు, వాహనాల రిజిస్ట్రేషన్ కోసం వచ్చేవారు సాంకేతికంగా చోటుచేసుకున్న మార్పులు, దానికి తగినట్లు సిబ్బంది వ్యవహరించలేక పోవడం, అవగాహనారాహిత్యం, సర్వర్‌లో ఎదురౌతున్న ఇబ్బందులు వెరసి ఈ కార్యాలయానికి వచ్చే వారికి శాపంగా పరిణమిస్తున్నాయి. త్రీ టైర్ విధానం ఇప్పటికే హైదరాబాద్, సికింద్రాబాద్, రంగారెడ్డి తదితర జిల్లాల్లో అమలులో ఉంది. వాహనాల రిజిస్ట్రేషన్‌లు, ఇతరత్రా వాటిలో అక్రమాలు, అవకతవకలకు పాల్పడకుండా ఉండేందుకు ఈ కొత్త విధానం మేలైనదే అయినప్పటికీ నూతన సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించడంలో సిబ్బందికి తగిన శిక్షణ ఇవ్వకపోవడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. క్షణాల్లో జరిగే పనులకు రోజుల తరబడి తిరగాల్సి వస్తోందని వాహనాల వినియోగదారులు వాపోతున్నారు. దీనిని దృష్టిలో ఉంచుకొని ఆ శాఖ అధికారులు తగిన చర్యలు చేపట్టాలని పలువురు కోరుకొంటున్నారు.

# ఆధార్ అవస్థలు!

## ఎప్పటికి తీరేనో?

ఆధార్ కార్డుల జారీ ప్రక్రియ జిల్లాలో గందరగోళంగా మారింది. దేశంలోని పౌరులందరికీ ఈ కార్డును అందజేసేందుకు కేంద్ర ప్రభుత్వం ఆధార్ కార్డును ప్రవేశ పెట్టింది. అందులో ఉండే విశిష్ట నెంబరు ద్వారా ప్రభుత్వం ప్రవేశపెట్టే పథకాలను అనుసంధానం చేసేందుకు, భారత పౌరుడిగా గుర్తింపుకు ఈ ఆధార్ కార్డుకు ఎంతో ప్రాధాన్యత కల్పిస్తూ ఆదేశాలు జారీ చేసింది. దీనికి అనుగుణంగా జిల్లాలో పౌరసరఫరాల శాఖ ఏడాది క్రిందట కార్డుల జారీ ప్రక్రియ చేపట్టింది. వివిధ మండల కేంద్రాలు, మునిసిపాల్టీలు, కార్పొరేషన్ పరిధిలో కేంద్రాలు ఏర్పాటు చేసి ఫోటోలు తీయడం, వ్యక్తిగత వివరాలు నమోదు చేసుకుని కార్డులు అందజేస్తామని ప్రకటించారు అధికారులు. మొదట్లో కేవలం 15 లక్షల మంది మాత్రమే ఆధార్ కార్డులకు దరఖాస్తులు అందజేసి ఫోటోలు తీయించుకొన్నారు. ఇంకా యాభై శాతం మంది తీయించుకోవాల్సి ఉంది. ఈ పరిస్థితుల్లో మొదట తీసిన వారికి ఇళ్లకు ఆధార్ కార్డులు వస్తాయని చెప్పినప్పటికీ చాలా మందికి ఇప్పటికీ కార్డులు అందలేదు. ఒక కుటుంబంలోని సభ్యుల్లో కొద్ది మందికి చేరాయి. పోస్టాఫీసు ద్వారా కార్డుల పంపిణీ చేపట్టడంతో చాలా మటుకు కార్డులు పోస్టాఫీసుల్లో మగ్గుతున్నాయి. ఆధార్ కార్డులు తీసేందుకు ప్రభుత్వం కమీషన్ పద్ధతిన ఏర్పాటుచేసిన ఏజెన్సీలు మధ్యలోనే మూటాముల్లె సర్దేయడంతో మధ్యలోనే ఈ ప్రక్రియకు బ్రేక్ పడింది. ఈ నేపథ్యంలో ప్రభుత్వం ఆధార్ కార్డును తప్పనిసరి చేయడం, వివిధ సబ్సిడీ పథకాలకు ఆధార్ కార్డును అనుసంధానం చేయడంతో ప్రజలు ఆధార్ కార్డుల కోసం పరుగులు పెట్టాల్సి వస్తోంది. నగరంలో సండే మార్కెట్ వద్ద జిల్లా అంతటికీ ఒకే ఒక్క కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. దీంతో ఇక్కడికి వచ్చి ఆధార్ కార్డు పొందాలనుకొనేవారు బారులు తీరాల్సి వచ్చేది. ప్రజల నుంచి విమర్శలు రావడంతో తాజాగా ఎన్జీఓ హోంలో మరో కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. ఎన్ని చర్యలు చేపట్టినా ఆధార్ కార్డులు తీయించుకున్న వారికి ఆ కార్డులు సక్రమంగా అందేలా ప్రణాళికా బద్దంగా వ్యవహరించకపోతే ఎన్ని కేంద్రాలు ఏర్పాటుచేసినా ప్రయోజనం శూన్యం. దీన్ని దృష్టిలో ఉంచుకొని అధికారులు ఆధార్ కార్డుల జారీ ప్రక్రియను సమర్థవంతంగా చేపట్టాల్సి ఉంది.

● కలువాయి సొసైటీ

# పగ్గాలు చేపట్టిన చల్లా!

**చివరి నిమిషంలో మామను నిలబెట్టిన అనిల్**



చల్లా సుబ్బరామిరెడ్డిని అభినందిస్తున్న అభిమానులు.

కలువాయి సహకార సంఘం అధ్యక్షుడిగా మాజీ ఎమ్పీపి అనిల్ వర్గానికి చెందిన చల్లా సుబ్బరామిరెడ్డి ఎన్నికయ్యారు. స్థానిక సొసైటీ కార్యాలయంలో జరిగిన కార్యక్రమంలో అధ్యక్షుడిగా ఆయన్ను, ఉపాధ్యక్షుడిగా కాపా వెంకటరత్నంను సభ్యులు ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. నూతన బాధ్యతలు చేపట్టిన సుబ్బరామిరెడ్డి మాట్లాడుతూ తనను అధ్యక్షుడిగా ఎన్నుకున్నందుకు అందరికీ కృతజ్ఞతలు తెలిపారు. పార్టీలకు అతీతంగా అందరికీ అందుబాటులో వుంటానని, మండలంలోని రైతాంగానికి సకాలంలో విత్తనాలు, ఎరువులు పంపిణీ అయ్యేలా కృషి చేస్తానన్నారు. పెంచలకోన ట్రస్టు బోర్డు మాజీ ఛైర్మన్ నెల్లూరు రవీంద్రరెడ్డి ముఖ్యఅతిథిగా విచ్చేసి పాలకవర్గ సభ్యులను సన్మానించారు. ఈ కార్యక్రమంలో మాజీ ఎంపిపి అనిల్ కుమార్‌రెడ్డి, వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ మండల కన్వీనర్ దుంపా రామచంద్రారెడ్డి, టిడిపి మండల కన్వీనర్ వెంకటేశ్వర్లు నాయుడు తదితరులు పాల్గొన్నారు.

# ముసునూరు సొసైటీ అధ్యక్షునిగా కేతిరెడ్డి!



జగదీశ్వర్‌రెడ్డిని అభినందిస్తున్న బొబ్బల శ్రీనివాసయాదవ్ తదితరులు.

ముసునూరు సహకార సంఘం అధ్యక్షుడిగా కేతిరెడ్డి జగదీశ్వర్‌రెడ్డి విజయం సాధించారు. పోటాపోటీగా జరిగిన ఈ ఎన్నికల్లో చివరకు కేతిరెడ్డి గెలుపొందారు. మాజీ శాసన సభ్యుడు కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి ఆశీస్సులతో ఎన్నికల బరిలో దిగిన జగదీశ్వర్‌రెడ్డి విజయం సాధించి తెలుగుదేశం, వైఎస్ జగన్‌పార్టీని ఖంగుతినిపించాడు. ఆయన అధ్యక్షుడిగా ఎన్నికకావడంతో అనుచరులు ఆనందం వ్యక్తం చేశారు. ముసునూరు నుంచి కావలి పట్టణం వరకు ఊరేగింపు నిర్వహించారు. అనంతరం ఆర్అండ్‌బి గెస్టు హౌస్‌లో వున్న విష్ణువర్ధన్‌రెడ్డి కలసి కృతజ్ఞతలు తెలిపారు. సొసైటీని అన్నివిధాలుగా అభివృద్ధి చేసేందుకు తనవంతు కృషి చేస్తానని జగదీశ్వర్‌రెడ్డి హామీ ఇచ్చారు. ఈ కార్యక్రమంలో కాంగ్రెస్‌పార్టీకి చెందిన గోసాల గోపాల్‌రెడ్డి, బొబ్బల శ్రీనివాస యాదవ్, కేతిరెడ్డి శివకుమార్‌రెడ్డి, గ్రంధి యానాదిశెట్టి, కనమర్లపూడి వెంకటనారాయణ తదితరులు పాల్గొని నూతనంగా ఎన్నికైన వారిని అభినందించారు.

# చైనా ఉప రాయబారిగా నెల్లూరీయుడు!

**కావలిలో అభినందన వెల్లువ**

చైనా దేశానికి ఉప రాయబారిగా కావలి ప్రాంతానికి చెందిన బాలభాస్కర్ నియమింపబడడం ఆనందంగా వుందని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు వ్యాఖ్యానించారు. ఈ నియామకం పొందిన బాలభాస్కర్ కావలి పట్టణానికి విచ్చేయడంతో ఆయన్ను కలసి పుష్పగుచ్ఛం అందించి శుభాకాంక్షలు తెలిపారు. మస్తాన్‌రావు మాట్లాడుతూ బాలభాస్కర్ ప్రభుత్వ గుర్తింపు పొందడమేకాక ఈ ప్రాంతానికి తగిన పేరు ప్రతిష్టలు తీసుకొనివచ్చారని ప్రశంసించారు. చైనా ఉపరాయబారిగా నియమింపబడడం గర్వకారణమన్నారు. మాజీ జడ్పీటిసి నాయుడు రాంప్రసాద్, మాజీ కౌన్సిలర్ ఆత్మకూరు బ్రహ్మయ్య, మలిశెట్టి వెంకటేశ్వర్లు, గాదంశెట్టి వేణుగోపాల్ తదితరులు బాలభాస్కర్‌ను కలసి అభినందనలు తెలిపారు.

● తోటపల్లి గూడూరులో

# సత్తాచూపిన తెలుగుదేశం!

తోటపల్లి గూడూరు, పేదూరు సహకార సంఘాల ఎన్నికల్లో తెలుగుదేశంపార్టీ వ్యూహాత్మకంగా, ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి పట్టు నిలుపుకొంది. తోటపల్లి గూడూరు సొసైటీకి గతంలో అధ్యక్షుడిగా వుండి రైతుల అభిమానాన్ని సంపాదించుకున్న చినబాబిరెడ్డి ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. నామినేషన్ సమయంలో హడావిడి చేసిన వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ బాబిరెడ్డి ధాటికి నిలువలేకపోయింది. ఇక పేదూరు సొసైటీకి కాంగ్రెస్, తెలుగుదేశంపార్టీ ఉమ్మడి అభ్యర్థిగా రంగంలో దిగిన సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి సోదరుడు శ్రీనివాసులరెడ్డి గెలుపొందారు. ఈ సొసైటీ మాజీ అధ్యక్షుడు తిక్కవరపు సనత్‌కుమార్‌రెడ్డి గట్టిపోటీ ఇచ్చినప్పటికి విజయం సాధించలేకపోయాడు. శ్రీనివాసులరెడ్డి గెలుపుకు శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి, పాపిరెడ్డిపాళెంకు చెందిన ఆల్తూరు ఆదినారాయణరెడ్డి చేసిన ప్రయత్నాలు ఫలించాయి. వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీకి అభిమానులు, కార్యకర్తలున్నా నాయకత్వం లోపం కొట్టొచ్చినట్లు కన్పడింది.

● కలువాయిలో

# రోడ్డునపడ్డ కాంగ్రెస్ వర్గపోరు!

**రామనారాయణ × రాజ్యలక్ష్మమ్మ వర్గీయులు**

కలువాయి సొసైటీ ఎన్నికల్లో బట్టబయలైన కాంగ్రెస్ వర్గపోరు ఆ తర్వాత ఒకరిపై ఒకరు దాడులు చేసుకునేంత వరకు వెళ్లడం చర్చనీయాంశమయ్యింది. ఇటీవల జరిగిన సొసైటీ ఎన్నికల్లో కాంగ్రెస్‌పార్టీలో ఆనం, నేదురుమల్లి వర్గాలుగా విడిపోయిన సంగతి తెలిసిందే. ఈ నేపథ్యంలో సొసైటీ పాలకవర్గం ఏర్పడిన తర్వాత ప్రమాణస్వీకార కార్యక్రమంలో మరోసారి వర్గవిభేదాలు రాజుకున్నాయి. బాణాసంచా కాల్చే విషయమై వివాదం నెలకొనింది. నేదురుమల్లి వర్గీయులు బాణాసంచా కాలుస్తుంటే, ఆనం వర్గానికి చెందిన చల్లా శ్రీనివాసులరెడ్డి, కోటిరెడ్డి ఎస్.ఐ రామ్మూర్తి వద్దకు వెళ్లి అభ్యంతరం తెలిపారు. ఈ సందర్భంగా ఇరువర్గాలు దూషణకు దిగాయి. ఒక దశలో ఒకరిపై ఒకరు దాడికి దిగారు. దీంతో పోలీసులు రంగప్రవేశం చేసి ఆనంవర్గం వారిని స్టేషన్‌కు తరలించారు. దీంతో వారు బాణాసంచా కాలుస్తుంటే చూస్తూ ఊరుకోవడమే కాకుండా మమ్మల్ని స్టేషన్‌కు తీసుకువస్తావా మా మంత్రికి చెప్పి నీ సంగతి తేలుస్తామంటూ ఎస్ఐపై ఆగ్రహించారు. అదే సమయంలో పోలీస్‌స్టేషన్ ప్రక్క నుంచి ఊరేగింపుగా వెళ్తున్న నేదురుమల్లి వర్గంపై స్టేషన్‌లో వున్న ఆనం వర్గానికి చెందిన వ్యక్తి టెంకాయ విసరడంతో మళ్లీ గొడవ జరిగింది. దీంతో నేదురుమల్లి వర్గానికి చెందినవారు ఎస్ఐతో గొడవపడ్డారు. మాపై టెంకాయ విసురుతుంటే చూస్తూ ఊరుకుంటావా, రాజ్యలక్ష్మమ్మతో చెప్పి నీ అంతు తేలుస్తామంటూ హెచ్చరించారు. అటు ఆనం వర్గం, ఇటు నేదురుమల్లి వర్గాలతో పాపం ఎస్ఐ నానాతిట్లు తినాల్సి వచ్చింది. ముందు ముందు ఈ గొడవలు ఎంతకు దారితీస్తాయోనని ప్రజలు హడలిపోతున్నారు.

● సోమలరేగడలో

# మారణ కాండ!

**● దాయాదులే హంతకులు**



ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న రాధాకృష్ణారెడ్డి.

దుత్తలూరు మండలం సోమలరేగడలో జరిగిన మారణకాండ జిల్లావాసులను ఉలిక్కిపడేలా చేసింది. బత్తాయితోటల్లో నివాసం ఏర్పరచుకొని ఊరికి దూరంగా కుటుంబంతో జీవిస్తున్న బొందల రాధాకృష్ణారెడ్డి కుటుంబంపై కిరాతకులు కొడవళ్లు, మచ్చుకత్తులతో పాశవికంగా అత్యంత దారుణంగా పిల్లల్ని, ఆడవాళ్లను, కుటుంబ పెద్దలపై దాడి చేయడంతో నెత్తురు ఏరులైపారింది. బయట పడుకొని వున్న రాధాకృష్ణారెడ్డి తండ్రి వెంకట సుబ్బారెడ్డిపై మొదటగా దుండగులు దాడి చేశారు. దీంతో సుబ్బారెడ్డి కేకలు పెట్టడంతో ఇంట్లో నిద్రిస్తున్న రాధాకృష్ణారెడ్డి తలుపు తెరచుకొని బయటకు రావడంతో ఆయనపై వరండాలోనే విచక్షణారహితంగా దాడి చేశారు. అనంతరం ఇంట్లో నిద్రిస్తున్న ఆయన భార్య రమాదేవి, కుమార్తె ఝాన్సీ, కొడుకు సోమశేఖర్‌రెడ్డిపై పాశవికంగా దాడి చేయడంతో తల్లీకూతుళ్ల అక్కడికక్కడే మృతి చెందగా, పిల్లవాడు ఆస్పత్రిలో చికిత్స పొందుతూ మరణించాడు. తీవ్ర గాయాలపాలైన వెంకటసుబ్బారెడ్డి, రాధాకృష్ణారెడ్డిలు చెన్నైలో చికిత్స పొందుతున్నారు. ఈ దారుణ మారణకాండతో గ్రామంలో భయందోళనలు అలుముకొన్నాయి. దాయాదులే కక్షకట్టి పరమ కిరాతకంగా హతమార్చారని, దీనికి కొంత రాజకీయ స్పర్థలు చోటు చేసుకొన్నాయని అనుమానాలు వ్యక్తం అవుతున్నాయి. ఎస్పీ రమణకుమార్ ఘటనా స్థలం చేరుకొని హత్యలు జరిగిన తీరును, రక్తపు మరకలను పరిశీలించారు. హంతకులను త్వరలోనే పట్టుకొంటామని గ్రామస్తులు ఆందోళన చెందనవసరంలేదని చెప్పారు. నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి, ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి దాడిలో గాయపడి చెన్నైలోని సిఎంకెరెడ్డి ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న రాధాకృష్ణారెడ్డి తదితరులను పరామర్శించారు.

# అల్ఫా హేచరీకి ఉత్తమ హేచరీ అవార్డు!



కొరుటూరులో వెనామి రొయ్య పిల్లలను ఉత్పత్తి చేసే అల్ఫా హేచరీకి భారతదేశంలోనే అత్యుత్తమ హేచరీ అవార్డు వచ్చింది. విజయవాడలో జరిగిన ఆక్వా ఎక్స్‌పోలో ఈ అవార్డును హేచరీ అధినేత సుధాకర్‌కు కేంద్ర వాణిజ్య పన్నుల శాఖా మంత్రి పురంధేశ్వరి అందించారు. సుధాకర్ గత 22 ఏళ్లుగా ఆక్వా రంగంలో చేసిన కృషికిగాను ఈ అవార్డు తగిన గుర్తింపని పలువురు రొయ్యల రైతులు అభిప్రాయపడ్డారు.



# చంద్రబాబును ప్రజలు నమ్మరు!

**ఊటుకూరులో నల్లపరెడ్డి ప్రసన్న**

వస్తున్నా మీ కోసం అంటూ తెలుగుదేశంపార్టీ అధినేత చంద్రబాబునాయుడు పాదయాత్ర చేస్తూ చిత్ర విచిత్ర వేషాలు వేస్తున్నా ప్రజలు నమ్మే పరిస్థితిలో లేరని కోవూరు శాసనసభ్యుడు నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి తేల్చి చెప్పారు. రాని నవ్వు తెచ్చిపెట్టుకొని ప్రజలతో మమేకమయ్యేందుకు తంటాలు పడుతున్న చంద్రబాబు నాయుడు అధికారంలోకి రావడం జరగని పని అన్నారు. వస్తున్నా మీ కోసం అంటూ ఇప్పుడు పాదయాత్ర చేస్తున్న బాబు వచ్చే ఎన్నికల తర్వాత పోతున్నా మీ కోసం అంటూ నారావారిపల్లెకు పోవాల్సిందేనని ఎద్దేవా చేశారు. విడవలూరు మండలం ఊటుకూరు పెద్దపాళెంలో మత్స్యకారులకు బయోమెట్రిక్ కార్డులను పంపిణీ చేసేందుకు వచ్చి ఆయన పైవిధంగా వ్యాఖ్యానించారు. పిసిసి అధ్యక్షుడు బొత్స సత్యనారాయణ తొమ్మిది మంది కాంగ్రెస్ ఎమ్మెల్యేలను బహిష్కరించినట్లు ప్రకటించారని, దీని ప్రకారం ప్రభుత్వం మైనార్టీలో పడిందన్నారు. ఈ పరిస్థితుల్లో ప్రభుత్వంపై అవిశ్వాసం పెట్టి గద్దెదించే అవకాశం వున్నా తెలుగుదేశం ప్రభుత్వం ఆ పని చేయకుండా మైనార్టీ ప్రభుత్వాన్ని కాపాడుతోందని ఆరోపించారు. ఎప్పుడు టిడిపి అవిశ్వాసం పెట్టినా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ మద్దతు ఇస్తుందని ఒక ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. అనంతరం మత్స్యకారులకు బయోమెట్రిక్‌కార్డులను పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో మత్స్యశాఖ అధికారి హెల్డీ, వైకాపా నేతలు రాంప్రసాద్, నాగేశ్వరరావు, సుబ్బారెడ్డి, కృష్ణ, శ్రీనివాసులరెడ్డి తదితరులు పాల్గొన్నారు.



జలదంకి మండలం కొత్తపాళెం గ్రామంలో రైతులను ధాన్యం ధర మీద ప్రశ్నిస్తున్న కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి. ప్రక్కన ఆర్డీఓ సుబ్రహ్మణ్యం రెడ్డి.

# ఫ్యాక్టరీ వద్దంటూ నిరసన!

**పంటపాళెం చుట్టూ ఫ్యాక్టరీలే!**

కాలుష్యాన్ని వెదజల్లే ఫ్యాక్టరీని గ్రామానికి సమీపంలో ఏర్పాటు చేయొద్దని ముత్తుకూరు మండలం పంటపాళెం గ్రామానికి చెందిన దళితులు ఆందోళనకు దిగారు. కృష్ణపట్నం పోర్టు బైపాస్‌రోడ్డు వద్ద ఈపూరు గ్రామ పరిధిలో ఇప్పటికే ఏడు పామాయిల్ ఫ్యాక్టరీలు ఏర్పాటై వున్నాయి. ఈ ఫ్యాక్టరీల నుంచి వచ్చే వాసన పంటపాళెం గ్రామం వరకు వ్యాపిస్తుండడంతో ఈ ప్రాంత ప్రజలు తట్టుకోలేకపోతున్నారు. ఫ్యాక్టరీలు వెదజల్లే కాలుష్యం, వచ్చే దుర్గంధాన్ని భరించలేక సతమతం అవుతున్నారు. ఈ పరిస్థితుల్లో దళితవాడ సమీపంలో ప్లాస్టిక్ వస్తువులు తయారీ ఫ్యాక్టరీని ఏర్పాటు చేసేందుకు సిద్ధమవుతున్నారు. ఈ విషయం తెలుసుకున్న గ్రామస్తులు ఫ్యాక్టరీని ఏర్పాటు చేయరాదంటూ పనులను అడ్డుకొన్నారు. ఇప్పటికే చుట్టుప్రక్కల ప్రాంతాల్లో ఏర్పాటు చేసిన వివిధ ఫ్యాక్టరీల వలన అనారోగ్య సమస్యలు తలెత్తుతున్నాయని, నివాసం వుండలేక పోతున్నామని, ఈ పరిస్థితుల్లో ఇక్కడ ప్లాస్టిక్ కర్మాగారాన్ని నిర్మించడం ఎంతవరకు సమంజసం అని వారు ప్రశ్నిస్తున్నారు. దీనిపై జిల్లా అధికారులకు తెలిపినా స్పందన కరువైందన్నారు. తామే రంగంలోకి దిగి ఫ్యాక్టరీ పనులను అడ్డుకొంటున్నామని ప్రకటించారు. ఈ సందర్భంగా ఆందోళనకారులు అక్కడ నిర్మించి వున్న రేకుల షెడ్డును ధ్వంసం చేశారు. ఎలాంటి పరిస్థితుల్లోను ఇక్కడ ఫ్యాక్టరీ ఏర్పాటుకు ఒప్పుకొనేది లేదని తెగేసి చెప్పారు. ఇప్పటికైనా అధికారులు కలుగజేసుకొని తమ డిమాండ్‌కు తలొగ్గాలని లేదంటే ఆందోళన తీవ్రతరం చేస్తామని హెచ్చరించారు.

**● గూడూరులో**

# పనబాక X ఎల్లసిరి!

**సొసైటీ రాజకీయాలా... మజాకానా?**

గూడూరు సొసైటీ అధ్యక్ష ఎన్నికలు పలు నాటకీయ పరిణామాల మధ్య ప్రశాంతంగా ముగిశాయి. మొత్తం 13 సెగ్మెంట్లకు గాను 12 సెగ్మెంట్లలో కాంగ్రెస్‌పార్టీ, ఒక సెగ్మెంట్‌లో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థులు విజయం సాధించారు. ఈ ఫలితాలు వెలువడిన తర్వాత అధ్యక్ష స్థానానికి ఎంపిక చేసే విషయమై నియోజకవర్గ ఇన్‌చార్జి పనబాక కృష్ణయ్య మాజీ శాసనసభ్యుడు ఎల్లసిరి శ్రీనివాసులరెడ్డి మధ్య సుదీర్ఘ మంతనాలు జరిగినా ఒక కొలిక్కి రాకపోవడంతో అధ్యక్ష ఎన్నికలు ఒకరోజు వాయిదా పడ్డాయి. ఈ పరిస్థితుల్లో ఎన్నికలు జరగాల్సి వుండగా ఒకటి,రెండు సెగ్మెంట్ల నుంచి గెలిచిన మనుబోలు సురేఖ, వెంకటసుబ్బయ్యలు రాజీనామా అస్త్రం ప్రయోగించడంతో గందరగోళం నెలకొంది. చివరకు పలు దఫాలు చర్చలు సాగించి 12వ సెగ్మెంట్ నుంచి గెలుపొందిన మల్లా శ్రీనివాసులరెడ్డిని అధ్యక్షునిగా, 13వ సెగ్మెంట్ నుంచి విజయం సాధించిన గ్రిద్దలూరు ముత్యాలయ్య ఉపాధ్యక్షుడిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. అసంతృప్తులు, అలకలు, నిరసనలు, ఆగ్రహావేశాల నడుమ గూడూరు సొసైటీ అధ్యక్ష ఎన్నికలు ముగిశాయి.

**● సిఏ చదువుకు**

# బిఎంఆర్ సహాయం!

**ఎవరికైనా సాయపడతానన్న మస్తాన్‌రావు**

పేదరికం కారణంగా ఉన్నత చదువులకు ఇబ్బంది పడుతున్న కావలి పట్టణానికి చెందిన విద్యార్థికి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు ఆర్థిక సహాయం చేసి ఆయన దాతృత్వాన్ని చాటుకొన్నారు. స్థానికంగా కాపురముండే శివయ్య, అంజమ్మల కుమారుడు హరీష్‌బాబు సిఏ కోర్సు చేసేందుకు బిఎంఆర్ చారిటబుల్‌ట్రస్టు తరపున 25వేల రూపాయలను అందజేశారు. ఇటీవల పట్టణంలో జరిగిన ఒక కార్యక్రమంలో ఆ విద్యార్థికి ఈ మొత్తాన్ని అందించారు. గతంలోనూ ఈ అబ్బాయి పదవతరగతి చదువుకు, ఆ తర్వాత ఇంటర్మీడియట్ పూర్తి చేసేందుకు బిఎంఆర్ ట్రస్టు సహాయం చేసి వుంది. ఈ సందర్భంగా శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు మాట్లాడుతూ ప్రతిభ వుండి పేదరికం కారణంగా చదువు కొనసాగించలేని విద్యార్థులకు తనవంతు సహాయ సహకారాలు అందిస్తానని హామీ ఇచ్చారు. పేద విద్యార్థులు తమ ట్రస్టుకు లేఖ పూర్వకంగా తెలియజేస్తే సహాయం చేస్తామన్నారు.



# ఆత్మకూరులో ఇసుక మాఫియా!

జిల్లాలో వివిధ ప్రాంతాల నుంచి ఇసుక అక్రమణ రవాణా జరుగుతున్నా అన్నింటిలోకి అధికంగా రవాణా జరిగే ప్రాంతంగా ఆత్మకూరును చెప్పొచ్చు. బోగ్గేరు నుంచి అధిక సంఖ్యలో వాహనాలతో తరలిపోతున్న ఇసుక అటు రెవెన్యూ సిబ్బందికి, ఇటు పోలీసుశాఖకు కాసుల వర్షం కురిపిస్తోంది. అక్రమంగా ఇసుక రవాణా చేసే వారికి పోలీసు పూర్తి సహకారం అందిస్తుండడంతో అటు ఇసుక దొంగలకు, ఇటు పోలీసులకు దండిగా కాసులు ముడుతున్నాయి. ఇందుకోసం పోలీసులు ట్రాక్టర్ల యజమానులకు రోజువారి, నెలవారీగా కమీషన్ మొత్తాన్ని నిర్ణయించి ఆ ప్రకారం ఇసుక అక్రమ రవాణా జరగడానికి సంపూర్ణంగా మద్దత్తు ఇస్తుండడంతో ఈ రవాణా మూడు పువ్వులు ఆరు కాయలుగా జరుగుతోంది. ప్రభుత్వం ఇసుక అక్రమ రవాణాపై కఠినంగా వ్యవహరించాలని అధికారులకు ఆదేశాలు జారీ చేస్తున్నా అవేమీ తమకు పట్టవన్నట్లుగా పోలీసులు మామూళ్ల మత్తులో మునిగితేలుతున్నారు. తమకు ముందుగా ముడుపులు ముట్టజెప్పిన వారికి సంబంధించి వాహనాలను మాత్రమే ఇసుక తరలించేందుకు అనుమతిస్తూ, తమకు లంచాలు ఇవ్వని వారిని వేధిస్తున్నారనే విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. గతంలో ముంబాయి – నెల్లూరు రహ

**రెవిన్యూ సిబ్బంది, పోలీసులకు డబ్బే డబ్బు!**

దారి మీద తిరిగే ఐరన్‌ఓర్ లారీలు పోలీసులకు కాసుల పంట పండించేవి. ఇప్పుడు ఇసుక రవాణా రూపంలో జేబులు నింపుకొంటున్నారు పోలీసులు. ఇటీవల ఈ వాటా పంపకంలో పోలీసుల మధ్య గొడవకు దారి తీసిందట. పోలీసుశాఖ పరువు బజారున పడకముందే ఎస్పీగారు దీనిపై దృష్టి సారించాలని ఈ ప్రాంత ప్రజలు కోరుకొంటున్నారు.

# చిల్లకూరు సొసైటీ తెలుగుదేశం వశం!

**● చక్రం తిప్పిన బల్లి దుర్గాప్రసాద్**

ఆద్యంతం ఉత్కంఠత రేపిన చిల్లకూరు సహకార సంఘం ఎన్నికల్లో అధ్యక్ష పీఠం తెలుగుదేశంపార్టీ వశమైంది. అటు అధికార కాంగ్రెస్‌పార్టీ, ఇటు వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలు చివరివరకు పోటీ ఇచ్చినప్పటికీ తెలుగుదేశం అభ్యర్థి వేమారెడ్డి కుమారస్వామిరెడ్డి విజయం సాధించారు. చిల్లకూరు మండలంలోని 13 సెగ్మెంట్లకు సంబంధించి తొలివిడత జరిగిన సహకార ఎన్నికల్లో ఆరు స్థానాలలో తెలుగుదేశంపార్టీ, మరో ఆరు స్థానాలను కాంగ్రెస్, ఒక్క స్థానంలో వైఎస్ఆర్‌కాంగ్రెస్‌పార్టీ బలపరచిన అభ్యర్థి గెలుపొందారు. ఏ పార్టీకి స్పష్టమైన మెజార్టీ రాకపోవడంతో అధ్యక్ష పదవిపై ఉత్కంఠత నెలకొంది. ఈ నేపథ్యంలో తెలుగుదేశంపార్టీ ఛైర్మన్ అభ్యర్థిగా కుమారస్వామిరెడ్డి నామినేషన్ దాఖలు చేయగా, కాంగ్రెస్ అభ్యర్థుల మద్దతుతో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి కల్లు వెంకటరమణయ్య నామినేషన్ వేశారు. టిడిపి అభ్యర్థికి ఏడు ఓట్లు రాగా, వైకాపా అభ్యర్థికి ఆరు ఓట్లు పోలయ్యాయి. దీంతో కుమారస్వామిరెడ్డి విజయం సాధించారు. ఈ విజయాన్ని అడ్డుకొనేందుకు కాంగ్రెస్, వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలు విశ్వప్రయత్నం చేసినా ఫలితం లేకుండా పోయింది. తెలుగుదేశంపార్టీ గెలుపొందేందుకు గూడూరు శాసనసభ్యుడు బల్లి దుర్గాప్రసాద్ కీలకంగా వ్యవహరించగా, కుమారస్వామిరెడ్డి వర్గీయులైన విష్ణువర్ధన్‌రెడ్డి, మధుసూధన్‌రెడ్డి ప్రముఖ పాత్ర పోషించారు.

# చెన్నపల్లిపాళెం స్కూల్‌లో మ్యూజియం!

**● సోషల్ టీచర్ స్వర్ణలత శ్రమతో ఏర్పాటు**

సాంఘిక, చారిత్రక అంశాలతో ఏర్చి కూర్చి తోటపల్లి గూడూరు మండలం చెన్నపల్లిపాళెం (మహాలక్ష్మిపురం) ఉన్నత పాఠశాల ఉపాధ్యాయులు ఏర్పాటు చేసిన మ్యూజియం, ఫోటో గ్యాలరీ అబ్బురపరుస్తోంది. విద్యార్థులకు వివిధ అంశాలపై విజ్ఞానాన్ని పెంపొందించాలన్న లక్ష్యంతో వీరు రూపొందించిన ఛాయా చిత్రం ప్రదర్శన ఆకట్టుకుంటోంది. ఆది మానవుని నుంచి నాగరిక మనుషుల దాకా జరిగిన మార్పులు, సాంస్కృతిక పునర్ వైభవం, స్వాతంత్ర్యం కోసం పోరాటం చేసిన యోధులు, రాష్ట్రపతులుగా పని చేసిన వారు, ప్రధాన మంత్రులుగా వున్న వారి ఫోటోలు, ఇతరత్రా చిత్రాలు, పాతకాలం నాణాలు, ఎన్నెన్నో ఈ మ్యూజియంలో కొలువై వున్నాయి. అలాగే తిరగలి, సొరకాయ బుర్ర, పాతకాలం గ్రామ్‌ఫోన్ రికార్డు లాంటివి వున్నాయి. 150కుపైగా వివిధ ఫోటోలతో ఏర్పాటు చేసిన మ్యూజియానికి ఆచార్య నాగార్జున ఫోటో గ్యాలరీగా నామకరణం చేశారు. విద్యార్థులకు ఎంతో ఉపయుక్తంగా వుండే ఈ కార్యక్రమాన్ని రూపొందించేందుకు ప్రధానోపాధ్యాయులు శ్రీనివాసులు సహకారంతో ప్రముఖ కవి శివారెడ్డి కుమార్తె, సోషల్ టీచర్ నాగారెడ్డి స్వర్ణలత, వ్యాయామ ఉపాధ్యాయుడు పాపురాల వేణు ఎంతగానో శ్రమించారు.

# రైతుల సంక్షేమమే కాంగ్రెస్ ధ్యేయం!

**పడుగుపాడులో పోలంరెడ్డి**

రైతుల సంక్షేమమే కాంగ్రెస్ ప్రభుత్వ ధ్యేయమని కోవూరు మాజీ శాసనసభ్యుడు పోలంరెడ్డి శ్రీనివాసులరెడ్డి తెలిపారు. పడుగుపాడు సొసైటీ ఎన్నికల్లో విజయం సాధించిన వారిని ప్రమాణ స్వీకారోత్సవ కార్యక్రమానికి ఆయన ముఖ్య అతిథిగా హాజరయ్యారు. ఈ సందర్భంగా శ్రీనివాసులరెడ్డి మాట్లాడుతూ యువకులైన జెట్టి రాజగోపాల్‌రెడ్డి సొసైటి అధ్యక్షునిగా ఎన్నిక కావడం హర్షణీయమన్నారు. సొసైటీని మరింతగా అభివృద్ధి పరచాలని ఆ దిశగా కృషి చేయాలని నూతనంగా ఎన్నికైన వారికి సూచించారు. అధ్యక్షుడిగా బాధ్యతలు చేపట్టిన రాజగోపాల్‌రెడ్డి మాట్లాడుతూ పోలంరెడ్డి సహకారంతో సొసైటీని అభివృద్ధి పరచేందుకు తన వంతు కృషి చేస్తామన్నారు. అనంతరం సొసైటీ అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, డైరెక్టర్లను పూలమాలలతో సన్మానించారు. ఈ కార్యక్రమంలో సిడిసి మాజీ ఛైర్మన్ జక్కంపూడి కృష్ణారెడ్డి ఏఎంసి డైరెక్టర్లు సుధాకర్ రెడ్డి, కోటయ్య, మురళి, వెంకట కృష్ణయ్య, దయాకర్, కాంగ్రెస్ నేతలు, శివారెడ్డి, పెంచలయ్య, భాస్కర్, రామచంద్రారెడ్డి, శేఖర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.



# మారని కావలి పెద్దాస్పత్రి వైద్యులు!

ప్రజాప్రతినిధులు, ఉన్నతాధికారులు ఎన్ని హెచ్చరికలు చేసిన కావలి ఏరియా వైద్యశాల సిబ్బంది పనితీరు మార్చుకోకపోవడం వారి చర్మ మందాన్ని తెలియజేస్తోంది. ఈ ఆస్పత్రుల్లో వైద్యసేవలు సక్రమంగా అందకపోవడంపై పలువురు పలుమార్లు అధికారులు, స్థానిక శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు దృష్టికి తీసుకొనివచ్చారు. వీరు తనిఖీలు జరిపి పద్ధతి మార్చుకోమని, తగిన వైద్య సేవలు అందించాలని హెచ్చరించారు. ఎమ్మెల్యే మస్తాన్‌రావు అయితే ఏమాత్రం వీలు దొరికినా ఆస్పత్రిని తనిఖీ చేస్తుంటారు. కానీ ఆయన మెతకవైఖరి వల్ల వైద్యులకు భయం లేకుండా పోయింది. ఆయన మాటలు విని వూరుకోవడం తప్ప మెరుగుపరచుకోకపోవడంతో తరచూ విమర్శలు వస్తున్నాయి. ఏరియా వైద్యశాలపై ఇక్కడి పరిస్థితులు, వైద్యుల నిర్లక్ష్యంపై విద్యార్థులు ఆందోళన జరిపారు. ఇటీవల ఎమ్మెల్యే మస్తాన్‌రావు మరోసారి ఆస్పత్రిలో ఆకస్మిక తనిఖీలు చేపట్టారు. వైద్యుల పనితీరు, సిబ్బంది సకాలంలో

**ఫలితమివ్వని ఎమ్మెల్యే తనిఖీలు!**

హాజరు కాకపోవడంపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. దీనిపై డాక్టర్లు సాకులు చెబుతుండగా సహనం కోల్పోయిన ఆయన వారిపై తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. నేను తనిఖీకి వస్తుంటాను, మీరేమో పనితీరు మార్చుకొంటామంటారు, కాని మీరు మారరు. బయటకు వెళితే విద్యార్థులు ధర్నాలు చేస్తున్నారు. దీనిపై ఆస్పత్రి కమిటీ ఛైర్మన్‌గా నన్ను ప్రశ్నిస్తున్నారు. మీ వల్ల నేను మాటపడాల్సి వస్తోందని వాపోయారు. ఆస్పత్రికి 24 గంటలు విద్యుత్ అందించేందుకు అవసరమైన ఏర్పాట్లపై విద్యుత్‌శాఖ అధికారులతో మాట్లాడారు. అనంతరం క్వాలిటీ విభాగాన్ని పరిశీలించి అసంతృప్తి వ్యక్తం చేశారు. రక్తనిధికి అన్ని సౌకర్యాలు సమకూర్చినా తగిన సంఖ్యలో రక్త నిల్వలు లేకపోవడంపై బ్లడ్‌బ్యాంక్ ఇన్‌ఛార్జీ చిరంజీవిని ప్రశ్నించారు. ఇకనైనా పద్ధతి మార్చుకోవాలని సూచించారు.

• క్రైస్తవ ప్రపంచంలో...

# ప్రకంపనలు సృష్టించిన పోప్ రాజీనామా!



పోప్ అంటే తండ్రి అని అర్థం. గ్రీక్ (పప్పాస్), లాటిన్ (పాప) భాషలలో చిన్న పిల్లలు తమ తండ్రులను పిలుచుకొనే పదం నుంచి పుట్టిందే అది. మొత్తం క్రైస్తవ ప్రపంచానికి పోప్, తండ్రి వంటివాడు. భగవంతుడైన క్రీస్తు స్వర్గానికి రాజైతే, ఆ స్వర్గానికి భూలోకానికి సానుకూల అనుసంధానం చేసేవాడు పోప్. క్రైస్తవులు తొలి పోప్‌గా భావించి, ఆరాధించే సెయింట్ పీటర్స్ చేతికి ఏసుక్రీస్తు స్వయంగా స్వర్గలోక తాళాలు అప్ప చెప్పాడని విశ్వాసం. మానవులలో అర్హులైన వారికి స్వర్గలోకపు ప్రయోజనాలను అందించే బాధ్యత పోప్ మీద వుంటుంది. 120 కోట్ల క్రైస్తవ జనావళికి పోప్ నాయకుడు. ప్రపంచంలోని అతి పెద్ద మతం క్యాథలిక్ క్రైస్తవమే. గత రెండు వేల ఏళ్లుగా పోప్‌ల చరిత్ర అంటే మానవ చరిత్రగానే పరిగణించాలి.

## తిరుగులేని పోప్

పోప్ కేంద్ర స్థానం రోమ్ నగరంలోని వాటికన్ సిటీ. ప్రఖ్యాత రోమన్ చక్రవర్తి కాన్‌స్టాన్‌టిన్ ది గ్రేట్ పోప్ నివసించే రాజప్రసాదాన్ని నిర్మించాడని చెప్తారు. వాటికన్ సిటీ రోమ్‌లో ఒక భాగమే అయినా, దానికి ప్రత్యేక దేశంగా విశిష్ట ప్రతిపత్తి వుంటుంది. అమెరికన్ అధ్యక్షుడి కంటే మిన్నగా పోప్‌కు అన్ని దేశాల ప్రభుత్వాలూ గౌరవ మర్యాదలు అందిస్తాయి. ఆయన ఎక్కడకు వెళ్లినా ప్రపంచ చక్రవర్తిగా చూస్తారు. నిజానికి మధ్య యుగాలలో క్రైస్తవ చక్రవర్తులందరూ పోప్ ముందు మోకరిల్లేవారు. ఆ రాజ్యాల మధ్య పేచీలు తలెత్తినప్పుడు పోప్ తీర్పే తుది నిర్ణయంగా శిరసావహించే వారు. కాల క్రమంలో పోప్‌లు తమ రాజకీయ అధికారాలను వదలిపెట్టి కేవలం క్రైస్తవ మత ప్రాభవానికి మాత్రం పరిమితమైనారు. దానికి బదలుగా మానవ హక్కుల పరిరక్షణ, సామాజిక సేవ వంటి అంశాలకు పోప్‌లు ప్రాధాన్యత ఇస్తున్నారు.

యాభై అరవై ఏళ్లక్రితం వరకు అమెరికా, ఐరోపా ఖండాలలోని ప్రభుత్వాలు పోప్ కన్నెర్ర చేస్తే కలవరపడిపోయేవి. వాటికన్ సిటీ అశాంతి తెలిపిన ఏ అంశం మీదా ఏ ప్రభుత్వమూ ముందుకు వెళ్లలేకపోయేది. కానీ ఇప్పుడు ఆ తీవ్రత కొంత తగ్గింది. స్వలింగ సంపర్కం, గర్భస్రావం వంటి వివాదాస్పద నిర్ణయాలలో పోప్ అభిమతాన్ని ధిక్కరించి నిర్ణయాలు తీసుకొంటున్నాయి పలు ఐరోపా దేశ ప్రభుత్వాలు. దాని అర్థం పోప్ వ్యవస్థ తన ఆధిపత్యాన్ని కోల్పోయిందని కాదు. దాని స్వరూపంలో వచ్చిన మార్పులకు మాత్రమే అది సంకేతం.

## పోప్ రాజీనామా

ప్రస్తుత పోప్ బెనెడిక్ట్ తన పదవికి రాజీనామా చేశారు. ఆ వార్త క్రైస్తవ లోకంలో ప్రకంపనలు పుట్టించింది. ఆ రాజీనామాకు కారణం కేవలం వృద్ధాప్యంలో వచ్చే అనారోగ్యం మాత్రమే కావడం కొంత ఉపశమనం. పోప్ బెనెడిక్ట్ పార్కిన్‌సన్ అనే మతిమరపు సమస్యతో ఇబ్బంది పడుతున్నారని చెప్తారు. వయస్సుతో వచ్చే సమస్య ఇది. దానివల్ల పోప్‌గా తాను నిర్వర్తించవలసిన బాధ్యతలను, జరిపించవలసిన మతపరమైన విధులను సక్రమంగా నెరవేర్చలేక పోతున్నాననే కారణంతోనే పోప్ బెనెడిక్ట్ తన పదవికి రాజీనామా చేశారు. ఎప్పుడో 600 ఏళ్ల క్రితం మాత్రమే పోప్ రాజీనామా అనే పరిస్థితి తలెత్తింది. ఈ మధ్యలో వచ్చిన పోప్‌లందరూ జీవితాంతం ఆ బాధ్యతలను నిర్వర్తించారు. అందువల్లనే క్రైస్తవ లోకం పోప్ రాజీనామా అన్న వార్త వినగానే ఉలిక్కి పడింది; కలవరానికి గురైంది.

## సమస్యలతో సతమతం

రోమన్ క్యాథలిక్ క్రైస్తవ మతము, పోప్ పీఠం కూడా పలు రకాల సమస్యలతో సతమతమౌతున్న సమయం ఇది. వాటిలో ప్రధానమైనది – పసిపిల్లలపై లైంగిక అత్యాచారం. చాలామంది క్రైస్తవ బిషప్‌లు చిన్న పిల్లలతో తమ శారీరక వాంఛలు తీర్చుకొంటున్న వుదంతాలు బయటపడుతున్నాయి. 2004 నుంచి 2011 సంవత్సరాల మధ్య ప్రపంచంలోని 8 క్యాథలిక్ బిషప్ కేంద్రాలు పసిపిల్లలపై జరిగిన అత్యాచారాలకు పరిహారంగా అపరాధ రుసుములు చెల్లించి, దివాలా తీశాయి. ఒక్క అమెరికా దేశంలో దాదాపు 3వేల కేసులు వివిధ న్యాయస్థానాలలో విచారణలో వున్నాయి. పసిపిల్లల మీద అత్యాచారాలు చేసే క్రైస్తవ మతాధిపతులు అందుకు పరిహారంగా అపరాధ రుసుము చెల్లించి కేసులు తప్పించుకొంటున్నారే తప్ప ఈ క్రూరమైన అమానవీయ చర్యను నివారించడానికి పోప్ స్థాయిలో గట్టి ప్రయత్నం జరగడం లేదన్నది ప్రధాన విమర్శ. అత్యాచారానికి పాల్పడిన బిషప్‌లను వేరొక చోటకు బదలీ చేయడం మాత్రమే జరుగుతున్నది తప్ప వారిని మతపరమైన విధుల నుంచి తప్పించే చర్యలకు పోప్ ఉపక్రమించలేక పోయారు. బిషప్‌ల శృంగార వాంఛలకు బలైపోయిన పసిపిల్లలలో మూడేళ్ల వయస్సున్న పసికందులు కూడా వుండడం క్రైస్తవ సమాజాన్ని సిగ్గుపడేట్లు చేస్తున్నది. ఇటువంటి పాపాలను పోప్ స్థానంలో కూర్చున్న మతాధిపతులు క్షమించి వదిలి వేయడం అన్యాయమన్నది బాధితుల ఆవేదన. దీని వల్ల పోప్ వ్యవస్థపైనే విశ్వాసం సడలిపోతున్నదని ఆందోళన చెందుతున్నారు సాంప్రదాయ క్రైస్తవులు.

## పోప్ వ్యవస్థ బలహీనం

క్రైస్తవ రాజ్యాల మీద పోప్ వ్యవస్థ తన ఆధిపత్యాన్ని పూర్తిగా కోల్పోతుండడం మరొక ఆందోళన కల్గించే అంశం. గర్భస్రావం, స్వలింగ సంపర్కం వంటి విషయాలలో పోప్ అభిమతానికి విరుద్ధంగా చట్టాలు చేస్తున్నాయి ఐరోపా దేశాలు. ఆయా ప్రభుత్వ అధిపతులను క్రైస్తవ మత నియమాలకు లోబడేట్లు చేయడంలో పోప్ విఫలమౌతున్నాడు. దానితో పోప్ వ్యవస్థ మీద ప్రజలలో గౌరవ భావం సన్నగిల్లుతున్నది. ఈ పరిస్థితిని మెరుగు పరచడంలో పోప్ బెనెడిక్ట్ విఫలమైనాడన్నది ప్రధాన ఆరోపణ. వివిధ దేశాలలో చర్చిలకు వచ్చి ప్రార్థనలు చేసే వారి సంఖ్య తగ్గి పోతున్నదని, దాని మెరుగుపరచడానికి, యువతరంలో క్రైస్తవ మత భక్తిని ప్రేరేపించడంలో పోప్ వ్యవస్థ సత్ఫలితాలు సాధించలేక పోతున్నదనే విమర్శ కూడా ఎదుర్కొన్నాడు పోప్ బెనెడిక్ట్. భవిష్యత్తు మత ప్రచారకులు, మతాధిపతులను సుశిక్షితులుగా తీర్చి దిద్దడంపైన కూడా బెనెడిక్ట్ శ్రద్ధ చూపలేదన్నది మరొక విమర్శ.

ఇన్ని అసంతృప్తులు, వైఫల్యాల మధ్య పని చేయవలసిన ఒత్తిడిని తట్టుకోలేకనే పోప్ బెనెడిక్ట్ తన పదవికి రాజీనామా చేశారనే వాదన ఒకటి వుంది. అయితే వ్యక్తిగా ఆయన మీద ఎటువంటి ఆరోపణలూ లేవు. జీవితకాలం క్రైస్తవ మతం కోసం అంకితం చేసిన గొప్ప మనిషిగా పేరుంది.

కొత్త పోప్ ఎన్నిక చాలా సంక్లిష్టమైన ప్రక్రియ. కార్డినల్స్ అని పిలిచే సీనియర్ బిషప్‌లతో కూడిన కమిటీ వంటి సంస్థ కొన్ని నెలల పాటు సెయింట్ పీటర్స్ భవంతులలో లోతైన చర్చలు, పరిశీలనలు, పరిశోధనలు జరిపి కొత్త పోప్‌ను ఎన్నుకొంటారు. అందుకోసం పలు దఫాలుగా ఓటింగ్ జరుగుతుంది. ఒక్కొక్కసారి ఆ ప్రక్రియ కొన్ని నెలల సమయం తీసుకొంటూ వుంటుంది.



## • మహాసప్తమి

# రథసప్తమి!

సకల చరాచర జగత్తుకు వెలుగు రేఖలు ప్రసాదించే ప్రత్యక్ష నారాయణుడైన సూర్య భగవానుడి జన్మదినమే రథసప్తమి. మాఘ శుద్ధ సప్తమినాడు సూర్యుడు జన్మించడమే కాకుండా, భూమికి మొట్ట మొదటిసారిగా దర్శనమిచ్చి రథాన్ని అధిరోహించాడు. అందుకే ఆ రోజును రథసప్తమి పండుగగా జరుపుకొంటున్నారని మత్స్యపురాణంలో వివరించబడింది. సూర్యుడు నవగ్రహాల్లో ప్రథముడే కాదు ప్రధానమైనవాడు. ఆయన వల్లే సర్వ భూతాలు ఏర్పడ్డాయని, సూర్యుడే పరబ్రహ్మ అని పురాణాలు చెప్తున్నాయి. త్రిమూర్తుల ఏకరూపమే సూర్యభగవానుడని సూర్యోపనిషత్తు వివరిస్తోంది. అంతటి విశేషమైన, విశిష్టమైన రథసప్తమి నాడు చేసే స్నానాలు, వ్రతాలు, పూజలు, దానాలు అధిక ఫలాన్నిస్తాయని చెబుతారు. సూర్యారాధన వేద కాలం నుంచే వుంది. వేదాల్లోని సౌర సూక్తులు, ఆదిత్య హృదయం ఈ విషయాన్ని ధృవీకరిస్తున్నాయి.

అదితి – కశ్యపులకు జన్మించిన సూర్య భగవానుడు ఉదయం వేళలో బ్రహ్మ స్వరూపంగాను, మధ్యాహ్నం వేళలో మహేశ్వరుని గాను, సాయంత్ర వేళ విష్ణు స్వరూపంగాను వుంటూ ప్రతి రోజు త్రిమూర్తి రూపంగా ప్రపంచానికి దర్శనమిస్తూ ముందుకు నడిపిస్తుంటాడు. సూర్యుడు కర్మసాక్షి. ఆయన లేని ప్రపంచాన్ని ఊహించలేం. మాఘ శుద్ధ సప్తమి నాడు సూర్యుడు తొలిసారిగా రథాన్ని అధిరోహించాడట. ఆనాడు నక్షత్రాలు రథాకారం దాలుస్తాయని, అందుకే ఈ సప్తమికి రథ సప్తమి అనే పేరొచ్చిందని చెప్తారు. ఈ పండుగ శిశిర రుతువులో వస్తుంది. అప్పటివరకు వున్న హేమంత రుతువులో తీవ్రంగా వుండే చలిలో కథ సప్తమి నాటి నుంచి మార్పు చోటు చేసుకొంటుంది. సూర్యుని తాపం పెరగడం వల్ల చలి తీవ్రత తగ్గుముఖం పడుతుంది.

రథసప్తమి నాటి పొద్దునే జిల్లేడు ఆకులను తలపైన, రెండు భుజాలపైన పెట్టుకొని స్నానం చేయాలి. జిల్లేడు ఆకులు (అర్కపత్రం) సూర్యుడికి ఇష్టమైన పత్రాలు. వాతావరణంలో జరిగే మార్పులను శరీరం తట్టుకొనేందుకు జిల్లేడు ఆకులతో చేసే స్నానం ఉపకరిస్తుందని ఆరోగ్యపరంగా మంచిదని చెప్తారు. అందులో వుండే ఔషధ గుణాలు చర్మ వ్యాధుల నుంచి, అనారోగ్యం నుంచి కాపాడుతాయని ఆయుర్వేద శాస్త్రం చెబుతోంది. అందుకే ఆరోగ్యం భాస్కరాధిచ్ఛేత్ అంటారు. అనగా ఆరోగ్యం సూర్యుని ఆధీనమని అర్థం. సూర్యారాధన వల్ల ఆరోగ్యం, తేజస్సు, శక్తి లభిస్తుందని సామవేదం పేర్కొంటోంది. ఆదిత్యుని అర్చించడం వల్ల జ్ఞానం సిద్ధిస్తుందని కృష్ణ యజుర్వేదం చెబుతోంది. సూర్యుడికి ఏడు అంకెకు ఎంతో అవినాభావ సంబంధముంది. ఆయన రథానికి వుండే గుర్రాలు ఏడు, తిరిగే ద్వీపాలు ఏడు. సూర్యకిరణాల్లోని రంగులు ఏడు. ఆ వెలుగులు ఏడు సముద్రాలకు పాకుతాయి. అందుకే సూర్యుడిని సంస్కృతంలో సప్తలోక ప్రదీపన అంటారు. ఆధ్యాత్మికంగానే కాక భౌతిక, ఖగోళ, ఆరోగ్యరీత్యా ప్రాముఖ్యం కల్గిన గ్రహ నాయకుడు సూర్యుడు. అలాంటి ప్రత్యక్ష దైవం, సమయపాలకుడు, ఆరోగ్యప్రదాత అయిన ఆదిత్యుని జన్మదినమైన రథసప్తమినాడు సూర్యారాధన చేయడం ఎంతో పుణ్యఫలమని పురాణాలు చెప్తున్నాయి.

భూ వివాదాలు

## • నెల్లూరులో

# ముదురుతున్న భూ వివాదాలు!

**నగర శివారు ప్రాంతం కొత్తూరు సమీపంలోని సర్వే నెంబరు 162, 62, 63, 64లలో 150 ఎకరాల భూమి యాజమాన్య హక్కులపై ఎప్పటి నుంచో గొడవ జరుగుతోంది. ఈ మధ్య ముదిరి పాకాన పడి రాయలసీమ రౌడీలొచ్చి నానా గొడవలు చేస్తుంటే అధికార యంత్రాంగం చోద్యం చూస్తూ సరిపెడుతోంది.**

నెల్లూరు నగరం శివారు ప్రాంతాల్లో వున్న భూముల వివాదం రోజురోజుకు వివాదాస్పదంగా మారుతున్నా అధికారులు మాత్రం చాలా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారు. కొత్తూరు సమీపంలోని సర్వే నెంబర్ 161, 62, 63, 64లలో దేవిరెడ్డి కోదండరామిరెడ్డికి దాదాపు 150 ఎకరాలు భూములుండేవి. కాలక్రమంలో ఈ భూములు అనేక మంది చేతులు మారినట్లు రికార్డులు సృష్టించుకున్నారు. ఒకరి నుంచి మరొకరు కొనుగోలు చేసినట్లు అగ్రిమెంట్లు పుట్టించడంతో సమస్య మరింత జఠిలమవుతుంది. భూ వివాదాలు అధికారుల దృష్టికి వచ్చిన వెంటనే స్పందించి పరిష్కార మార్గం చూపినట్లయితే న్యాయం జరిగే అవకాశం వుంటుంది. రాజకీయ, పలుకుబడితో లంచాలు ఆశ చూపడంతో అధికారులు ముందుకు రావడం లేదన్న విమర్శలున్నాయి.

### రాయలసీమ నేతలు దిగారు!

ఇటీవల రాయలసీమ ప్రాంతానికి చెందిన కొందరు ఈ భూములు తమకు చెందినవంటూ రంగంలోకి దిగారు. దీంతో ఈ ప్రాంతంలో ఉద్రిక్తత పరిస్థితులు నెలకున్నాయి. భూసంస్కరణల చట్టం అమల్లోకి వచ్చిన తర్వాత దేవిరెడ్డి కోదండరామిరెడ్డి తన భూములు కాపాడుకునేందుకు ఆయన దగ్గర పనిచేసే కూలీల పేరున భూములు నమోదు చేశారు. ఆయన మరణానంతరం 1999 సంవత్సరంలో నగరానికి చెందిన సందాని బాషా 70 ఎకరాలు కొనుగోలు చేశారు. కొనుగోలు చేసిన భూములను ఇళ్లప్లాట్లుగా ఏర్పాటు చేసి విక్రయాలు కూడా జరిపాడు. అప్పట్లో తెలుగుదేశం అధికారంలో వుండడంతో కాంగ్రెస్ మద్దతుదారుడిగా వున్న సందాని టిడిపికి అనుకూలంగా మారాడు. 2005వ సంవత్సరంలో కాంగ్రెస్‌పార్టీ అధికారంలోకి రావడంతో సందాని కొనుగోలు చేసిన భూముల వివాదం తెరపైకి వచ్చింది. అప్పట్లో నగర ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి ఫిర్యాదుతో అక్రమ నిర్మాణాలను రెవెన్యూ అధికారులు తొలగించడం జరిగింది.

దేవిరెడ్డి కోదండరామిరెడ్డి కుటుంబానికి చెందిన కొడుకు అనిల్‌కుమార్ రెడ్డి, మనవళ్లు హైద్రాబాద్‌లో వున్నారు. ప్రస్తుతం వారి భూములు అక్రమించుకున్న వారు హైద్రాబాద్ వెళ్లి వారి చేత డాక్యుమెంట్లపై సంతకాలు చేయించినట్లు తెలిసింది. బత్తల వెంకటసుబ్బారెడ్డి అనే వ్యక్తి 34 ఎకరాలు దుబ్బాక సుబ్బన్న చౌదరికి విక్రయించినట్లు అగ్రిమెంట్లు సృష్టించారు. అప్పట్లో ఈ భూముల వివాదం కోర్టు వరకు వెళ్లి డిక్రీ పొందారు. అప్పటి ఎమ్మార్వో భాస్కర్ నాయుడు కోర్టు డిక్రీ మేరకు 34 ఎకరాలకు సంబంధించి హద్దులు చూపడం జరిగింది. అనంతరం జెఎల్ నారాయణ కొడుకు తదితర కొనుగోలు చేసినట్లు చెప్పుకొంటూ ఇతరులకు విక్రయాలు జరిపారు. సుబ్బన్న చౌదరి కొడుకు రమేష్ చౌదరి రంగంలోకి దిగి విక్రయాలు జరిపిన ప్లాట్లు తమవేనంటూ తిరిగి స్వాధీనం చేసుకున్నారు. ప్లాట్లు కొనుగోలు చేసిన బాధితులు లబోదిబోమంటూ ప్రభుత్వానికి, లోకాయుక్తలకు ఫిర్యాదు పంపారు.

ఈ భూముల వివాదంపై పూర్తి వివరాలను పంపాలని జిల్లా కలెక్టర్ ఆదేశాలందాయి. వివాదంగా మారిన భూముల్లో ముదివర్తి గ్రామానికి చెందిన మోడేగుంట పోలయ్య కుమారుడు 32 ఎకరాలు తమకు చెందినవని మరొక వాదన వినిపిస్తున్నారు. రమేష్ చౌదరి అనంతపురం జిల్లాకు చెందిన వ్యక్తి అని తెలవడంతో కొందరు బాధితులు తెలుగు దేశంపార్టీ ఎమ్మెల్యే పరిటాల సునీతను కలసి తమ సమస్యలను వివరించినట్లు తెలిసింది. భూములకు చెందిన అసలు వ్యక్తులు మరణించడంతో వాస్తవ పరిస్థితి ఏమిటన్నది తెలిసే అవకాశం లేకుండా పోయింది. రెవెన్యూ అధికారుల వైఫల్యం కారణంతోనే ఈ భూములు వివాదం ముదిరిపాకాన పడిందని బాధితులు వాపోతున్నారు. రాయలసీమ ప్రాంతానికి చెందిన వ్యక్తులు ఇక్కడ తిష్ట వేయడంతో ఆందోళన వ్యక్తం చేస్తున్నారు.

# వారఫలాలు

తేది 16-2-2013 నుండి 22-2-2013 వరకు మేషంలో కేతువు; వృషభంలో గురువు; తులలో శని, రాహువులు; మకరంలో శుక్రుడు, 21తేది నుండి కుంభంలో; కుంభంలో రవి, బుధ, కుజులు ; మేష, వృషభ, మిధునాలలో చంద్రుడు సంచరిస్తారు.

**మేషం** (అశ్వని, భరణి, కృత్తిక 1 పా)

గతంలో నలుగుతున్న కొన్ని సమస్యలకు పరిష్కారాలు దొరుకుతాయి. క్రమంగా ఆర్థికంగా స్థిరపడి, అనుకున్న పనులు పూర్తవుతాయి. మీ ఆలోచనలకు కుటుంబ, బంధుమిత్రుల సహాయం లభిస్తుంది. వృత్తి, వ్యాపారాలు పుంజుకొని లాభసాటిగా సాగుతాయి. విద్యార్థులకు ఇది అనుకూల కాలం. నిరుద్యోగుల ప్రయత్నాలకు అత్యంత అనుకూలం. రాజకీయులు స్వల్ప వివాదాలలో ఇరుక్కొంటారు.

**వృషభం** (కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా)

ఇంట్లో తలపెట్టిన శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాల వారి ఆర్థిక స్థితి బాగుంటుంది. స్థిరాస్తి విషయాలలో దీర్ఘకాలంగా వున్న సమస్యల నుండి బయటపడతారు. కోర్టు కేసుల విషయాలలో ఒక నిర్ణయానికి రావడం మంచిది. అయినవారి వల్ల మోసపోయే అవకాశాలున్నాయి. వ్యవసాయ, కళా, క్రీడా రంగాలలోని వారికి వృత్తిపరమైన చిక్కులు తొలగి అనుకూలతలు సాధిస్తారు.

**మిథునం** (మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా)

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారు ఆలోచనాపరంగా, ఆర్థికంగా పురోభివృద్ధి సాధిస్తారు. మీ ప్రతిభకు గుర్తింపు లభిస్తుంది. కొత్త పరిచయాల వల్ల లాభాలు. కోర్టు వ్యవహారాలలో ఆచితూచి వ్యవహరించడం మంచిది. విద్యార్థులు తమ లక్ష్య సాధనలో ముందడుగు వేస్తారు. రాజకీయులు తమ క్రింది వర్గాల విషయంలో జాగ్రత్తలు పాటించాలి.

**కర్కాటకం** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

చాలాకాలంగా పనులలో కలుగుతున్న అవరోధాలు తొలగి మీ ఆలోచనలు కార్యరూపం దాలుస్తాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి పై అధికారుల, పలుకుబడి కల్గిన వ్యక్తుల సహకారాలు లభిస్తాయి. ఆర్థికంగా పుంజుకుంటారు. ఇంట్లో శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. కోర్టు, ఆస్తి మొదలైన దీర్ఘకాలంగా సాగుతున్న వ్యవహారాలు వాయిదా వేయడం మంచిది.

**సింహం** (మఖ, పుబ్బ ఉత్తర 1 పా)

పనులలో కలుగుతున్న ఆటంకాల వల్ల ఆందోళన అనవసరం. పట్టుదలతో పనులు పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆదాయానికి తగ్గట్టే ఖర్చులుంటాయి. కుటుంబ విషయంలో శ్రద్ధ అవసరం. నిరుద్యోగులకు గట్టి ప్రయత్నంతో విజయం తథ్యం. విద్యార్థులకు శ్రమానంతర ఫలితం లభిస్తుంది. వ్యవసాయ, కళా, క్రీడ రంగాలలోని వారికి ఆర్థికస్థితి గతంలో కన్నా మెరుగ్గా వుంటుంది.

**కన్య** (ఉత్తర 2,3,4పా. హస్త, చిత్తా 1, 2 పా)

వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారు తమకు అప్పగించిన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తిస్తారు. సంఘంలో గౌరవం, పరపతి పెరుగుతుంది. నూతన వస్తు, వాహనాలు, భూములు, ఇండ్ల ప్లాట్లు కొనుగోలు చేస్తారు. చిరకాల సన్నిహితులను కలుస్తారు. వృత్తిపరమైన ఆర్థిక ఇబ్బందులుండవు. అకస్మాత్తుగా ధన లాభ సూచనలున్నాయి. విద్యార్థులకు ఆరోగ్య భంగం.

## పంచాంగం

16తేది వరుణ షష్ఠి.
17తేది రథ సప్తమి, సూర్య జయంతి.
18తేది భీష్మాష్టమి, మీనాయనం.
19తేది శతకార్తె, శ్రీరామకృష్ణ జయంతి.
21తేది భీష్మ ఏకాదశి, అంతర్వేది తీర్థం.
22తేది శుక్ర మౌఢ్యమి, వరాహ ద్వాదశి.

### శుభ ముహూర్తాలు

16.2.13 మాఘ శుద్ధ షష్ఠి నుండి శ్రీ విజయనామ సంవత్సరం చైత్ర బహుళ తదియ 28.4.13 వరకు శుక్ర మౌఢ్యమి కారణంగా వివాహాది శుభ ముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య కార్యక్రమాలకు శుభముహూర్తాలున్నాయి.

### ఫిబ్రవరి తిథులు

మాఘ శుద్ధ

| | | | | | |
|---|---|---|---|---|---|
| 16 | శని | షష్ఠి | ప | 10.35 | గం.ల.వ |
| 17 | ఆది | సప్తమి | ప | 12.46 | గం.ల.వ |
| 18 | సోమ | అష్టమి | ప | 03.17 | గం.ల.వ |
| 19 | మంగళ | నవమి | సా | 05.59 | గం.ల.వ |
| 20 | బుధ | దశమి | రా | 08.32 | గం.ల.వ |
| 21 | గురు | ఏకాదశి | రా | 10.44 | గం.ల.వ |
| 22 | శుక్ర | ద్వాదశి | రా | 12.24 | గం.ల.వ |

అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

**తుల** (చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా)

తలపెట్టిన పనులలో తగు జాగ్రత్తలు అవసరం. కొన్ని సందర్భాలలో తమ తెలివితేటలు ఉపయోగించాలి. నూతన కార్యక్రమాలకు వాయిదా వేయడం మంచిది. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికస్థితి సామాన్యంగా వుంటుంది. విద్యార్థులకు చదువుకన్నా ఇతరత్రా ఆసక్తి ఎక్కువ. వ్యవసాయ, కళా, క్రీడలలోని వారికి పనిభారం తగ్గి, వారం ప్రారంభంలో ఆరోగ్య భంగం ఏర్పడతాయి.

**వృశ్చికం** (విశాఖ 4 పా. అనూరాధ, జేష్ఠ)

గతవారం కంటే ఉత్సాహంగా, ఉల్లాసంగా, నూతనంగా చేపట్టిన శుభకార్యాలలో పాల్గొంటారు. వృత్తి, వ్యాపార రంగాలు బాగా పుంజుకుంటాయి. ఆదాయం పెరుగుతుంది. కీర్తి ప్రతిష్టలు కలిగి వుంటారు. పుణ్యక్షేత్రాలు సందర్శిస్తారు. విద్యార్థులు కొత్త అవకాశాలు పొందుతారు. వ్యవసాయం, కళా, క్రీడా రంగాలు చక్కగా సాగుతాయి. అవసరానికి డబ్బు చేతికందుతుంది.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

చేస్తున్న పనులలో కొన్నింటిని వాయిదా వేయడం మేలు. ఆకస్మిక ప్రయాణాలు, ఆరోగ్య సమస్యలు బాధిస్తాయి. అయితే ఆర్థిక ఇబ్బందులు తగ్గుతాయి. అవసరానికి డబ్బు చేతికందుతుంది. వృత్తి, వ్యాపారాలలోని వారికి సామాన్యంగా వుంటుంది. పెద్దల సలహాలు, సహకారం అవసరమౌతుంది. విద్యార్థులకు ఈ వారం ప్రతికూలం. కళా, క్రీడా రంగాల వారు అనుకున్న అవకాశాలు పొందలేరు.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఇది అనుకూలమైన కాలం. మీ ఆలోచనలు కార్యరూపంలో పెట్టేందుకు తగిన సమయం. వృత్తి, వ్యాపారాల వారు క్రమబద్ధంగా వెళ్లడం వల్ల ఆదాయాలు మెరుగౌతాయి. చిన్నపాటి అవరోధాలు విజయానికి ఆటంకం కావు. కుటుంబంలో జరిగే శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. పుణ్యనదీ స్నానాలు, ఆలయాలు సందర్శిస్తారు. విద్యార్థులు బుద్ధిబలంతో విద్యలు సాధిస్తారు.

**కుంభం** (ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా)

క్లిష్టమైన సమస్యలలో చాకచక్యంగా వ్యవహరిస్తారు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికస్థితి మెరుగౌతుంది. విద్యార్థులు తమ బుద్ధి మెరుగుపరచుకొంటారు. వ్యవసాయానికి అనుకూలం. కళా, క్రీడా రంగాలవారు అరుదైన అవకాశాలు అందుకొంటారు. గౌరవం, సన్మానాలు పొందుతారు. ఆదాయానికి తగ్గ ఖర్చులు, ధన వ్యయం. రాజకీయులకు అనుకూల మార్పులు ఆనందాన్నిస్తాయి. రుణబాధలు తొలగుతాయి.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి)

తలపెట్టిన పనులలో ఆటంకాలున్నప్పటికీ అవసరానికి డబ్బు చేతికందుతుంది. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలోని వారి ఆర్థికస్థితి మెరుగనిపిస్తుంది. కొన్ని కీలక విషయాలను మీకనుకూలంగా మలచుకొంటారు. శుభకార్యాలలో పాల్గొంటారు. విద్యార్థులు కొత్త అవకాశాలు పొందుతారు. నిరుద్యోగులకు అనుకూలం. వ్యవసాయదారులకు రుణ సౌకర్యం లభిస్తుంది.

# అగ్నిదగ్ధ కాష్టవేధలు గృహవాస్తు ఉపకరణాల నిషిద్ధాలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

ఆచార్య సుబ్రహ్మణ్యా మహర్షి
4వ వీధి, గాయత్రీనగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ హెచ్.అనుపమ — బెంగుళూరు*

★ *'అగ్నిదగ్ధ కాష్టవేధను' ఓ వాస్తు గ్రంథం విపులంగా వివరించింది. అది ఏది, అవి ఏమిటి?*

వాస్తు ప్రాచీన గ్రంథం సమరాంగణ సూత్రధారణలో ఈ విషయక ప్రస్తావనలున్నాయి. అగ్ని వల్లను, పిడుగు పడుట ద్వారాను కాలిన వస్తు సామాగ్రి వల్ల కలిగే అరిష్టాన్ని పై విధంగా వ్యాఖ్యానించారు.

*పి.శకుంతల — పెనుగొండ*

★ *ఈ సమయంలో ఉత్తరాయణం గురించి చెప్పండి?*

మకర సంక్రాంతి నుంచి కర్కాటకం సంక్రమణ కాలాన్ని ఉత్తరాయణం అంటారు. దీనికి ఒక మాసం ముందు ధనుర్మాసం ప్రారంభమవుతుంది.

*గుడిపల్లి శ్రీహరి — సికింద్రాబాద్*

★ *'వశిష్ట వాస్తు సంహిత' ఆరో ప్రకరణం మీరు చదివారా?*

ఆత్మలు, పిశాచాలు ఆవాహన అందులోని ప్రధాన సూక్తం. వాటికి ప్రతీకారేచ్ఛ ఉంటుందని అందువల్ల దోషులు నరక యాతనలు పడి మరణిస్తారని సంహిత నిర్ధారణ చెబుతున్నది.

*బి.రేష్మపఠాన్ — హైదరాబాద్*

★ *మిమ్మల్ని అడిగితే చాలు శాస్త్రాలన్నీ ఏకరువు పెడతారు. ఏం చదువుకున్నారేమిటి?*

నిజానికి శాస్త్ర సారస్వతంలో నాలాంటి 'బిందు' సమానులు చాలామందే ఉన్నారు. జ్యోతిషం సిద్ధాంత, జాతక, సంహితలని మూడు విభాగాలు.

*డాక్టర్ ఫరీదాబేగం — సికింద్రాబాద్*

★ *ఇంటికి, ఇంట్లోని మనుషులకు బాగా దిష్టి ఉంది. ఆర్థికం, అనారోగ్య సమస్యలున్నాయి.*

మీ పుట్టిన తేదీ, సమయాలు, జన్మస్థలం వివరాలు పంపితే 'యంత్రాన్ని' చూసిస్తాను.

*ఎన్.విశ్వదాశాస్త్రి — గుంటూరు*

★ *శుక్లపక్ష, బహుళ పక్ష తిథులకు భేదము ఉందా?*

ఎందులోనైనా తిథులు 15 మాత్రమే.

*టి.ప్రత్యగాత్మ — సికింద్రాబాద్*

★ *రాశికి, నక్షత్రాలకూ సమన్వయం ఎట్లా?*

తొమ్మిది నక్షత్ర భాగాలు ఒక రాశి. గ్రహ ప్రయాణ మార్గం జ్యోతిశ్చక్రం.

*డాక్టర్ యశోద — కడప*

★ *శిశు జనన నక్షత్రాల ఫలితాలు నిజమేనా?*

నక్షత్ర పాదాలను బట్టి జననకాల దోషాలు చెప్పబడ్డాయి. శిశువులపై పగ, ప్రతీకారాలకు ఈ అంశాలు తోడ్పడుతాయి. కాబట్టి ఆధునిక కాలంలో వీటిని పాటించాల్సిన అవసరం లేదు.

*టి.సరస్వతి — కడప*

★ *ఆగమ శాస్త్ర విధివిధానాలు ఏ గ్రంథంలో ఉన్నాయి?*

ఆలయ నిర్మాణ పద్ధతుల్ని, శిల్ప విన్యాసాల్ని, ఆగమ శాస్త్రమని అంటారు. సమరాంగణ సూత్రధారణ అనే గ్రంథం మీలాంటి విద్యార్థులకు అనువైన గ్రంథం.

*డాక్టర్ భగవాన్ — సికింద్రాబాద్*

★ *మా కుమార్తె వివాహ విషయమై మనఃస్థాపానికి గురౌతున్నాము.*

అధైర్యపడి మీరు సాధించేది ఏమీ లేదు. వాస్తు దోషాల్ని సరిచేసుకోండి. భగవదనుగ్రహం కోసం ప్రయత్నించండి. నిర్ధారిత వాస్తు యంత్ర ప్రతిష్ట చేసుకోండి. అన్ని సమస్యలూ పరిష్కరింపబడుతాయి.

*ఎ.కె.ఆర్ — గూడూరు*

★ *నక్షత్ర రాశుల్ని చూడకుండా అమ్మాయిని తెచ్చుకున్నాము.*

మీ ఛాందసం మాకే కోపాన్ని తెప్పిస్తున్నది. అశ్వనీ నక్షత్ర జాతకులు కుటుంబ ఉన్నతికి కారకులౌతారు. మీ అభియోగాలు అర్థరహితం. ముందు మీరు మీ తప్పు తెలుసుకోండి.

*డి.షర్మిళ — తిరుపతి*

★ *'ఏకాదశి' రోజు ఉత్తర ద్వారం ప్రాశస్త్యం ఏమిటి?*

వేదోద్ధరణ, సంరక్షణకు విష్ణువు ఉత్తర ద్వారం గుండా ప్రవేశించి ఏకాదశి రోజు వెళ్లడం వల్ల ఈ ద్వారానికి అంత ప్రశస్తి ఏర్పడింది.

# నెల్లూరులో విచ్చలవిడిగా ఫైనాన్స్ సంస్థల ఏర్పాటు!

**జాతీయ బ్యాంకులు, పోస్టాఫీసుల కంటే అధిక వడ్డీ ఇస్తామన్న ఆశచూపి నగరంలో విచ్చలవిడిగా ఏర్పాటవుతున్న ఫైనాన్స్ సంస్థలు కొన్నాళ్లకు బోర్డు తిప్పేస్తుండడంతో ప్రజలు లబోదిబోమంటున్నారు.**

జిల్లాలో ఇటీవల కాలంలో పుట్ట గొడుగుల్లా ఫైనాన్స్ సంస్థలు పుట్టుకొస్తున్నాయి. వీటిని ఏర్పాటు చేస్తున్న నిర్వాహకులు ప్రజలు, ఉద్యోగుల నుంచి వివిధ రకాల స్కీంల పేరుతో నగదు కట్టించుకుని అనంతరం బోర్డు తిప్పి ఉడాయిస్తున్నారు. ఫైనాన్స్ సంస్థలను ఏర్పాటు చేసి, ఇళ్ల స్థలాలు, డిపాజిట్ చేసిన వారికి అధిక శాతం వడ్డీ చెల్లిస్తామని ఆశలు కల్పిస్తుంటారు. జాతీయ బ్యాంకులు, పోస్టాఫీసుల కంటే అదనంగా వడ్డీ ఇస్తామని హామీ ఇస్తుండడంతో అనేక మంది ఈ ఫైనాన్స్ కంపెనీల్లో పెట్టుబడులు పెడుతున్నారు. నిర్ణీత గడువు ముగిసేలోగా కంపెనీలను మూసేసి పరారు కావడంతో బాధితులు లబోదిబోమంటూ పోలీసులను ఆశ్రయిస్తున్న సంఘటనలు అనేకం వున్నాయి.

పోలీసులు కేసు నమోదు చేసుకుంటారే తప్ప నిర్వాహకుల నుంచి నగదు వసూలు చేసి బాధితులకు అందించలేని పరిస్థితి. నెల్లూరు నగరంతోపాటు జిల్లావ్యాప్తంగా అనేక ప్రైవేటు ఫైనాన్స్ సంస్థలు ఏర్పాటు కాబడి వున్నాయి. వీటిలో కొన్ని వాహనాలకు రుణాలు అందిస్తుండగా, మరికొన్ని వడ్డీ వ్యాపారం నిర్వహిస్తున్నాయి. అన్ని సంస్థలు కూడా తమ వ్యాపారాలను చట్టబద్ధంగా నిర్వహించడం లేదు. వీటిని చట్టబద్ధంగా నిర్వహించాలంటే సంస్థల పేర్లను రిజిస్ట్రేషన్ చేయించడంతో అన్ని రికార్డులను నిర్వహించాలి. అలాగే సెంట్రల్ ఎక్సైజ్‌శాఖకు సేవా పన్ను చెల్లించాల్సి వుంటుంది. అయితే ఒక్క ఫైనాన్స్ కంపెనీ కూడా చట్టబద్ధంగా రిజిస్ట్రేషన్ కాబడడం లేదు. ఏశాఖ కూడా ఇటువంటి ఫైనాన్స్ సంస్థల గురించి పట్టించుకోవడం లేదు.

చట్ట విరుద్ధంగా వడ్డీ వ్యాపారం, తండల్ వ్యాపారం, చీటీలు వేయడం చేయకూడదన్న నిబంధన వుంది. కానీ చట్టం గురించి ఏ ఒక్కరు కూడా ఆలోచించరు. వడ్డీ వ్యాపారం నిర్వహించే వారు నూటికి పది రూపాయలు వసూలు చేస్తూ పేద ప్రజలను ఆర్థికంగా దెబ్బతీస్తున్నారు. పేద, మధ్యతరగతి, ఉద్యోగుల నుంచి అధిక వడ్డీ ఆశతో డిపాజిట్లు సేకరించి ఎగనామం పెడుతున్నప్పటికి కొత్తగా మరి కొన్ని కంపెనీల ఏర్పాటుపై పోలీసులు నిఘా వుంచడం లేదు. గత సంవత్సరం నగరంలో వేదాయపాళెం సమీపంలో రామకృష్ణారెడ్డి అనే వ్యక్తి ఫైనాన్స్ సంస్థను ప్రారంభించి కోట్ల రూపాయలు డిపాజిట్లు సేకరించి పరారైన సంగతి అందరికి తెలిసిందే. బాధితుల ఫిర్యాదు మేరకు రంగంలోకి దిగిన పోలీసులు అతనిని మధ్యప్రదేశ్‌లో అరెస్టు చేసి నెల్లూరుకు తీసుకొచ్చారు.

స్టోన్‌హౌస్‌పేటలో మరో మహిళ చీటీల పేరుతో కోటి రూపాయలు వసూలు చేసి రాత్రికి రాత్రి పత్తా లేకుండా పోయింది. మోసం చేసిన తర్వాత పోలీసులను ఆశ్రయించడం తప్ప బాధితులకు న్యాయం జరగడం లేదు. ఇదిలా వుండగా వాహనాలకు రుణాలు అందిస్తున్న ఆటో ఫైనాన్స్ నిర్వాహకులు వ్యవహారశైలి మరోవిధంగా వుంటుంది. ఇటీవల కాలంలో ద్విచక్ర వాహనాల వినియోగించే వారి సంఖ్య బాగా పెరిగింది. పట్టణాలతోపాటు గ్రామీణ ప్రాంతాల యువకులు ద్విచక్ర వాహనాల కొనుగోలు ఆటో ఫైనాన్స్‌లను ఆశ్రయిస్తున్నారు. ఎటువంటి గ్యారంటీ లేకుండా వెంటనే రుణ సదుపాయం కల్పిస్తుంటారు. ఇచ్చిన రుణానికి నిర్ణీత గడువుకు ఒకే దఫా లెక్కించి అసలుతో కలిపి నెలసరి వాయిదాలను నిర్ణయిస్తారు. రుణం తీరేలోగా నూటికి 10రూపాయలు వడ్డీ చెల్లించాల్సి వస్తుందని వాహన యజమానులు వాపోతున్నారు.

రెండు నెలలు వాయిదాలు చెల్లించకుంటే మరుసటి నెలలో ఫైనాన్స్ చేసిన వాహనాన్ని స్వాధీనం చేసుకుంటారు. నగరంలో వున్న ఆటో ఫైనాన్స్ దుకాణాల్లో వందలాది వాహనాలు ప్రస్తుతం దర్శనమిస్తున్నాయి. చట్ట విరుద్ధంగా వడ్డీ వ్యాపారం చేసే ఫైనాన్స్ కంపెనీలపై సంబంధితశాఖ అధికారులు చర్యలు తీసుకుంటే భవిష్యత్‌లో ఎవరు కూడా మోసపోయే పరిస్థితి వుండదు.

జనాభిప్రాయం పట్టదా?

## ● కొత్తపట్నంలో...

# లెదర్ కాంప్లెక్స్ ఏర్పాటుకు మళ్లీ ప్రజాభిప్రాయ సేకరణ!

**కోట మండలం కొత్తపట్నంలో ఏర్పాటుచేయ తలపెట్టిన తోళ్ల పరిశ్రమను గ్రామస్తులు వ్యతిరేకిస్తున్నారు. గతంలో ఓసారి ఏర్పాటుచేసిన ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమం రసాభాస అయినా మళ్లీ మార్చి 6వ తేది ఏర్పాటు చేయడం చర్చనీయాంశమయ్యింది.**

వివాదాస్పదంగా మారిన లెదర్ కాంప్లెక్స్ పరిశ్రమ ఏర్పాటు కోసం మళ్లీ ప్రజాభిప్రాయ సేకరణ జరపాలని ప్రభుత్వం నిర్ణయించింది. గత నెలలో కాలుష్య నియంత్రణ మండలి ఆధ్వర్యంలో నిర్వహించిన ప్రజాభిప్రాయ సేకరణ కార్యక్రమాన్ని సమీప గ్రామాల ప్రజలు, ప్రజా సంఘాల నేతలు అడ్డుకున్న విషయం తెలిసిందే. పోలీసులు రంగ ప్రవేశం చేసినప్పటికీ ప్రజల ఆందోళనతో అధికారులు ఆ కార్యక్రమాన్ని విరమించుకోవాల్సి వచ్చింది. కోట మండలం కొత్తపట్నం గ్రామ పరిధిలో కృష్ణపట్నం పోర్టు కంపెనీ లెదర్ కాంప్లెక్స్ పరిశ్రమ ఏర్పాటు చేయాలని ప్రతిపాదించింది. ఇందుకు ప్రభుత్వం కూడా అనుమతిచ్చింది. 500 కోట్ల రూపాయల వ్యయంతో ఏర్పాటు చేసేందుకు ప్రణాళికలు రూపొందించడం జరిగింది.

ఈ పరిశ్రమ ఏర్పాటు వల్ల వెలువడే కాలుష్యం కారణంగా ప్రజల ఆరోగ్యం దెబ్బతింటుందని వివిధ ప్రజా సంఘాలు అభ్యంతరం వ్యక్తం చేస్తున్నాయి. ప్రజలు పెద్ద ఎత్తున తరలివచ్చి అభిప్రాయ సేకరణకు నిలిపివేసి అధికారులు తిరిగి వెళ్లాలని నినాదాలు చేయడంతో చేసేదేమీ లేక వెనుతిరిగారు. సమీప గ్రామాల ప్రజలతోపాటు పలు ప్రజా సంఘాలు, గూడూరు ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్‌రావు కొత్తపట్నం చేరుకుని ఆందోళన చేశారు. ఆందోళన చేపట్టే విషయాన్ని ముందుగానే అంచనావేసి భారీ ఎత్తున పోలీసులను రప్పించారు. ప్రారంభంలోనే నిరసనలు, ఆందోళనలు మొదలు కావడంతో బలప్రయోగం చేయాలని భావించారు. ప్రజలు తిరగబడడంతో అధికారులు వెనక్కు తగ్గాల్సి వచ్చింది. ఎలాగైనా సరే లెదర్ కాంప్లెక్స్ పరిశ్రమను నెలకొల్పాలన్న పట్టుదలతో తిరిగి అభిప్రాయ సేకరణ కార్యక్రమాన్ని నిర్వహించేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి.

కాలుష్య నియంత్రణ మండలి ఆధ్వర్యంలో జిల్లా కలెక్టర్ అధ్యక్షతన మార్చి 6వ తేది కొత్తపట్నం గ్రామంలో అభిప్రాయ సేకరణ జరుగుతుందని నోటిఫికేషన్ జారీ అయ్యింది. గతంలో రద్దుచేసిన కార్యక్రమాన్ని తిరిగి నిర్వహించనున్న నేపథ్యంలో ఆందోళన చేపట్టాలని ప్రజా సంఘాల నేతలు సన్నద్ధమవుతున్నారు. లెదర్ కాంప్లెక్స్ పరిశ్రమ ఏర్పాటును కొన్ని సంఘాల నేతలు స్వాగతిస్తూ ఇటీవల ప్రకటన కూడా చేశారు. పరిశ్రమ ఏర్పాటు వల్ల ఎటువంటి కాలుష్యం వెలువడదని ప్రజల ఆరోగ్యానికి ముప్పు వాటిల్లే అవకాశం లేదని చెప్పారు. దీనిని నిరూపించేందుకు తాము నిపుణుల ద్వారా చర్చించేందుకు సిద్ధంగా ఉన్నట్లు ప్రకటించారు. కొన్ని ప్రజా సంఘాల నేతలు కావాలనే ఉద్దేశంతోనే పరిశ్రమను అడ్డుకుంటున్నారని ఆరోపిస్తున్నారు.

### అనర్థాలు

అభివృద్ధి ముసుగులో జరుగనున్న విధ్వంసంలో సామాన్య ప్రజలు జీవించే హక్కును కోల్పోయే ప్రమాదం ఉంటుందని పర్యావరణ నిపుణులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. సాంప్రదాయక చేతివృత్తుల్లో తోళ్ల పరిశ్రమ ఒక భాగం. సాంకేతిక పరిజ్ఞానం లేకుండా వేల సంవత్సరాల నుండి చర్మంతో కేవలం చెప్పులే కాకుండా వివిధ వాయిద్య పరికరాలకు సున్నితమైన చర్మాన్ని తయారు చేయగల నైపుణ్యం ఉంది. తోళ్లు సేకరించే క్రమంలో కొత్తపట్నం, తూర్పు కనుపూరు, శ్రీనివాససత్రం, గోవిందపల్లి గ్రామాల్లో జీవించేందుకు వీలుకాని స్థాయిలో దుర్వాసన వచ్చే అవకాశం ఉందని నిపుణులు అంటున్నారు. పచ్చి చర్మాన్ని నిల్వ చేసేందుకు సున్నం, ఉప్పు, సోడియం సల్ఫైడ్‌లాంటి రసాయన పదార్థాలు వినియోగిస్తారు. వీటి కారణంగా ఊపిరితిత్తుల వ్యాధులు, అల్సర్, తదితర వ్యాధులు వ్యాపిస్తాయని వైద్య నిపుణులు హెచ్చరిస్తున్నారు. మిగిలిపోయిన ఘన పదార్థాలను నిల్వ చేస్తామని కంపెనీ ప్రతినిధులు చెబుతున్నారు. ఈ నిల్వల కారణంగా సమీప గ్రామాల్లో నీరు కలుషితమైపోయే ప్రమాదం ఉంటుంది.

పరిశ్రమలో 1500 మందికి ఉద్యోగాలు ఇస్తామని చేసిన ప్రకటనపై కూడా స్థానికులు అనుమానాలు వ్యక్తపరుస్తున్నారు. ఇప్పటికే ప్రారంభించిన అపాచీ, కృష్ణపట్నం పోర్టు, థర్మల్ ప్లాంట్లలో ఎంత మందికి ఉద్యోగాలిచ్చారో అందరికీ తెలిసిందే. ఇన్ని వివాదాల నడుమ మార్చి 6వ తేది అభిప్రాయసేకరణ నిర్వహించనున్నారు. ఈ దఫా కంపెనీ ప్రతినిధులు తమకు మద్దతుగా వ్యవహరించేందుకు కొన్ని సంఘాల నేతలతో సంప్రదింపులు జరిపినట్లు సమాచారం శాంతి భద్రతల సమస్య తలెత్తకుండా అధికార యంత్రాంగం పటిష్టమైన చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉంది.



# ఘాటుగా, రుచిగా మిర్చి!

✍ అల్లూరు రహీం

గత ఏడాది రెబల్ అవతారం ఎత్తాడు హీరో ప్రభాస్. కాని ఆ సినిమా ఆశించినంత ఫలితం ఇవ్వలేదు. దీంతో ప్రభాస్ చిన్ననాటి మిత్రులు వంశీకృష్ణ, ప్రమోద్ 'మిర్చి' చిత్రానికి శ్రీకారం చుట్టారు. మిర్చి కూడా గత ఏడాది రావాల్సింది. అయితే సంక్రాంతికి విడుదలవుతుందని చెప్పినా కాస్త ఆలస్యంగా ఫిబ్రవరి 8వ తేది ప్రేక్షకుల ముందుకు వచ్చిన 'మిర్చి'ని క్లాస్ మాస్ ప్రేక్షకులు మెచ్చేలా తీశాడు దర్శకుడు కొరటాల శివ. కథ పాతదే. ఫుల్ ఫ్యాక్షన్ నేపథ్యం వున్న కథకు ప్రేమతో మెరుగులు దిద్దాడు. అది చాలదని సెంటిమెంట్‌ను అదనంగా అద్దాడు. పాటలు, హీరోయిన్లు, డైలాగులు, కామెడీలు ఒకటేమిటి మిర్చిలో నవరసాలు ఘాటుగా అద్ది హీరో ప్రభాస్‌కు ఉపశమనం కల్గించాడనే చెప్పాలి. వీలైతే ప్రేమిద్దాం డ్యూడ్ అంటూ ముందుకు సాగిపోయే హీరో వెనుక ఎంతో వ్యధాపూరిత కథ దాగుంటుంది. దాన్ని మిర్చి చిత్రంలో మంత్రముగ్ధంగా చూపాడు తొలిసారే దర్శకుడైన కొరటాల శివ. ఈ సినిమా టీజర్స్‌లో మిర్చి మిర్చి అంటూ పాపులర్ అయిన పాట, ఐటమ్ గాళ్ హంసా నందిని అందర్నీ ఆకట్టుకొంటుంది. చిత్ర నిడివి పెరుగుతుందనో లేక సెన్సార్ కత్తెర వేసిందో కాని ఈ పాటను మూడు నిమిషాలకే దర్శకుడు కుదించాడు. దేవిశ్రీ ప్రసాద్ సంగీతం కూర్చిన ఖోల్ తేరీ కిటికీ చరణంతో సాగే పాటలో పంజాబీ సంగీతం, బార్బీ గాళ్ పాటలో వెస్ట్రన్ టచ్, కాటుక కళ్లను చూస్తే పాటలో క్లాస్ టచ్, డార్లింగే పాటలో మాస్ టచ్ కనిపిస్తాయి. అసలే పాటలే మిర్చికి పెద్ద ఎసెట్. దర్శకుడు కూడా ఈ పాటలను వెండితెరపై చాలా అందంగా చిత్రీకరించాడు. దీనికి మది కెమెరా కూడా ఎంతో సహకరించింది. ఇద్దరు హీరోయిన్లు హీరోతో తమ ప్రేమను వెల్లడిచేసే సన్నివేశాలు చాలా బాగున్నాయి. మూడు పదుల అనుష్కను అందంగా చూపడంలో దర్శకుడు కృతకృత్యుడయ్యాడు. బార్బీ గాళ్ పాటలోనే కాదు పాత్రోచిత నటనతో రిచా గంగోపాధ్యాయ ప్రేక్షకులను ఆకట్టుకొంటుంది.

ఎంత మగాడైనా ఆడవాళ్ళ దగ్గర లోకువన్నట్లు ఆరడుగుల హీరో ప్రభాస్‌ను అనుష్క రెండు సార్లు తలపై మొట్టే సన్నివేశం ఫ్యామిలీ ప్రేక్షకులను బాగా ఆకర్షిస్తుంది. టీవీ సీరియల్స్‌లో కనపడే చిన్న నటులైనా ఈ సినిమాలో పెద్ద పాత్రలను అవలీలగా పోషించారు. వీరప్రతాప్‌గా బ్యాంక్ మేనేజర్ పాత్రలో బ్రహ్మానందం మరోసారి నవ్వులతో ముంచెత్తాడు. వాస్తవంగా సినిమాలో హీరోకు తగ్గ విలన్ వుంటే ప్రతి సన్నివేశం పేలుతుంది. ఆరడుగుల విలన్‌గా సంపత్ అదరగొట్టాడు. దర్శకుడే వ్రాసిన మాటల్లో మనం ఎలా వుండాలంటే అలా వుంటుంది మన లైఫ్, తింటూమా చదువును, ఏ పాపం చేస్తే పుట్టావురా నాకు ఆలోచింప చేస్తాయి. తమిళ నటుడు సత్యరాజ్, పాత హీరోయిన్ నదియా మిర్చి చిత్రంలో ముఖ్యపాత్రలు పోషించి మెప్పించారు. ఈ సినిమాలో అందరి పాత్రల కన్నా ప్రధానమైన పాత్రలో ప్రభాస్ నూటికి నూరు శాతం మెప్పించాడు.

చిత్రకథలోనికి వెళ్తే గుంటూరు జిల్లాలోని ఇరగవరం, రెంటచింతల గ్రామాల్లోని నాయకులు ఉమ(సంపత్), దేవ(సత్యరాజ్)లకు ఒకరంటే మరొకరికి పడదు. లత(నదియా)ను పెళ్లి చేసుకున్నాక దేవలో మార్పు వచ్చినా ఉమ ఆ కుటుంబాన్ని తెగ నరకాలని చూస్తుంటాడు. తల్లితో కలిసి దూరంగా వుండే జై(ప్రభాస్) తండ్రిని చూడను రెంటచింతల వచ్చి ప్రత్యర్థివర్గాన్ని ముప్పతిప్పలు పెడతాడు. మరదలు వెన్నెల(అనుష్క)ను పెళ్లి చేసుకోపోయే సమయంలో ఇరువర్గాల మధ్య రక్తపాతం జరుగుతుంది. లత చనిపోతుంది. ఈ ఘటన తర్వాత దేవ తన కొడుకును గ్రామాన్ని వీడి పొమ్మంటాడు. ఇటలీ వెళ్లిపోయే జైను ఇరగవరంలోని ఫ్యాక్షన్ కుటుంబీకురాలు మానస(రిచా గంగోపాధ్యాయ) ప్రేమిస్తుంది. ఆమె కోసం శత్రువు ఇంట అతిథిగా వచ్చిన జై వారి మనసులు ప్రేమతో గెలుస్తాడు. రెండు గ్రామాలు పాత కక్షలు మర్చిపోయి ఒకటయ్యేలా చేసి ప్రేమకున్న శక్తిని చాటడంతో చిత్రం ముగుస్తుంది.

చిత్ర సమీక్ష

## అందాల ప్రదర్శనకు దూరం



టాప్‌లెస్‌గా ఫోటోలకు ఫోజులిచ్చి ఆ మధ్య వార్తల్లో కెక్కింది కాజల్ బాలీవుడ్‌లో తొలి అడుగులు వేసే దశలో. అయితే ఆ తర్వాత ఫోటో మార్ఫింగ్ అంటూ సమాధానమిచ్చింది. నవతరం భామల్లాగే కాజల్ కూడా గరమ్‌గరమ్ సన్నివేశాల్లో నటించేందుకు అభ్యంతరం చెప్పదని సినీరూపకర్తలు భావించారు. అయితే ఇటీవలే ఆమె అందాల ఆరబోతపై తన పాలసీని ప్రకటించింది. ఎక్స్‌పోజింగ్ సన్నివేశాలకు దూరంగా ఉండాలని భావిస్తున్నట్లు తెలిపింది. సినిమా అంటేనే గ్లామర్ ప్రపంచం. అలాగని చిట్టి పొట్టి దుస్తుల్లో కనిపిస్తూ అందాలు ఆరబోయాల్సిన అవసరం లేదు. అవసరం లేకపోయినా ఘాటైన సన్నివేశాల్లో నటింపజేయాలని ఎవరైనా అనుకొంటే నేను ఒప్పుకోను. ఆ విషయాన్ని దర్శకుల ముందే చెబుతాను. కథానాయిక గ్లామర్‌గా కనిపించాలి కదా? అంటారు. నిజమే అందంగా కనిపించాల్సిందే. అయితే దాన్ని చూపించే విధానంలోనే ఎంతో తేడా ఉంది. అందుకు అనేక మార్గాలున్నాయి. చిన్న దుస్తుల్లో కనిపిస్తేనే అందం అనుకోవడం పొరపాటు అని స్పష్టం చేసింది. ప్రస్తుతం కాజల్ బాద్‌షా, ఎవడు చిత్రాల్లో నటిస్తోంది. ఆమె హిందీలో నటించిన స్పెషల్ చబ్బీస్ సినిమా ఈ వారంలోనే విడుదలవుతుంది.



## అప్పుడే పెళ్లా?

హీరో రామ్ అల్లరి, చురుకుదనం ఉన్న పాత్రల్లో చక్కగా ఇమిడి పోతాడు. ఒంగోలు గిత్త సినిమా తర్వాత ఆయన 'బోల్ బచ్చన్' రీమేక్‌పై దృష్టి పెట్టాడు. ఈ విషయమై మాట్లాడుతూ ఇప్పుడిప్పుడే ఈ సినిమాకు సంబంధించిన పని మొదలయ్యింది. ఈ మధ్య బోల్ బచ్చన్ సినిమా చూశా. బాగా నచ్చింది. వెంకటేష్‌తో కలిసి నటించే అవకాశం రావడం ఆనందంగా ఉంది. ఎందుకంటే ఆయన వినోదాత్మక పాత్రల్ని భలే పండిస్తారు. ఆయన లేకపోతే ఈ సినిమాను ఒప్పుకునే వాడినే కాదన్నాడు. ఇంతకీ పెళ్లెప్పుడంటే... నా సినిమా ఎప్పుడు విడుదలవుతుందో... నాకే తెలీదు. ఇక పెళ్లి గూర్చి ఏం చెబుతాను? ఆ దిశగా నేను ఆలోచించడం లేదు. ఇప్పుడు అర్జెంట్‌గా పెళ్లి చేసుకోవలసిన అవసరమూ లేదన్నాడు.

## వార్తల్లో బాహుబలి!

తెలుగు సినిమా పరిశ్రమలో రాజమౌళి సినిమాకు సంబంధించిన ప్రతి విషయం ప్రత్యేకమే. ఏం చేసినా చర్చనీయాంశమే. ఇప్పుడు ఆయన భారీ వ్యయంతో ఓ చిత్రం చేయబోతున్నాడు. ప్రభాస్ హీరో, అనుష్క హీరోయిన్, రానా విలన్. ఆర్కా మీడియా సంస్థ నిర్మించే ఈ చిత్రానికి రాజమౌళి 100 కోట్ల రూపాయలు ఖర్చవుతుందని చెప్పగా నిర్మాతలు అంగీకరించారని ఫిల్మ్‌నగర్‌లో గుసగుసలు వినిపిస్తున్నాయి. తెలుగు సినిమా పరిశ్రమలో ఇంత వ్యయంతో ఏ సినిమా తయారు కాలేదు. ఇందుకు తగ్గట్లే బాహుబలిని తెలుగుతోపాటు తమిళ, హిందీ భాషల్లో ఒకేసారి విడుదల చేస్తారు. అందుకు తగ్గట్లే చిత్ర రూపకల్పన ఉండబోతోంది. ఈ సినిమాకు సాబుశిరిల్ కళాదర్శకుడు. కీరవాణి సంగీతం సమకూరుస్తాడు. ఛాయాగ్రహణం సెంథిల్ సమకూరుస్తాడు.

## మేకప్ లేకుండా సోనమ్!



సహజంగా సినిమా నటీనటులు మేకప్ లేకుండా కెమెరా ముందుకు వచ్చేందుకు ఇష్టపడరు. అలా చేస్తే డీ గ్లామర్ లుక్‌తో తమ గుర్తింపుకు ఇబ్బంది కలుగుతుందని భయం. ఈ భయానికి టాలీవుడ్, బాలీవుడ్, కోలీవుడ్ లాంటి తేడాలేమీలేవు. అయితే అడపా దడపా కొందరు దర్శకులు తమ సినిమాల్లోని హీరో, హీరోయిన్లను మేకప్ మెరుపులకు దూరంగా ఉంచుతూ ఉంటారు. హిందీ హీరోయిన్ సోనమ్‌కపూర్‌కు అటువంటి అనుభవమే ఎదురయ్యింది. ఈమె ప్రస్తుతం హిందీలో రంజన అనే చిత్రంలో నటిస్తోంది. వారణాసి నేపథ్యంలో సాగే కథ ఇది. ఆనంద్ ఎల్.రామ్ దర్శకత్వం వహిస్తున్నారు. ఈ సినిమాలో ఏ నటుడికీ ముఖానికి రంగులు పూయకూడదని స్పష్టం చేశాడు. ఆమె తొలుత అనుమానించింది. మేకప్ లేకపోతే బాగుండదేమో అని. అయితే దర్శకుడు కొన్ని సన్నివేశాలు చిత్రించి చూపించడంతో సోనమ్ విస్తుపోయిందని చిత్రవర్గాలు చెబుతున్నాయి.



## మహేష్ ఆగడు!

దర్శకుడు శ్రీనువైట్ల ఇప్పుడు ఎన్టీఆర్‌ని బాద్‌షాగా చూపించే కార్యక్రమంలో నిమగ్నమై ఉన్నాడు. దీని తర్వాత మహేష్‌బాబు చిత్రానికి దర్శకత్వం వహిస్తారు. దూకుడు సినిమాను తీసిన 14 రీల్స్ సంస్థ ఈ చిత్రాన్ని నిర్మిస్తుంది. ఈ సినిమాకు ఆగడు అనే పేరు నిర్ణయించారు. కథా చర్చలు సైతం మొదలయ్యాయి. ప్రస్తుతం సుకుమార్ దర్శకత్వంలో తయారయ్యే చిత్రంలో నటిస్తున్న మహేష్‌బాబు ఈ సినిమా పూర్తయ్యాక ఆగడు సెట్‌కు వచ్చేస్తాడు.

## ఆధార్ కేంద్రాలు ఏర్పాటు చేయండి!

● తెలుగుదేశం పార్టీ నిరసన



జిల్లా కలెక్టర్‌కు వినతిపత్రం ఇస్తున్న కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి.

నెల్లూరులో అదనంగా ఆధార్ నమోదు కేంద్రాలను ఏర్పాటు చేయాలని తెలుగుదేశం పార్టీ నగర అధ్యక్షుడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డిని కలిసి వినతి పత్రం సమర్పించారు. ఈ సందర్భంగా శ్రీనివాసులురెడ్డి విలేకరులతో మాట్లాడుతూ గతంలో నగర పాలక సంస్థ పరిధిలో ఏర్పాటు చేసిన అన్ని కేంద్రాలను పునరుద్ధరించాలని కోరారు. గ్యాస్ కనెక్షన్లు, ప్రభుత్వ పథకాల లబ్ధికి, ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలన్నింటికీ ఆధార్ కార్డును ప్రామాణికంగా తీసుకోమని ప్రభుత్వం విస్తృతంగా ప్రచారం చేస్తున్నందున ఆధార్ కార్డు డిమాండ్ విపరీతంగా పెరిగిందన్నారు. దీన్ని దృష్టిలో ఉంచుకొని నగరంలో ప్రజలకు అందుబాటులో ఉండేలా ఆధార్ నమోదు కేంద్రాలను ఏర్పాటుచేయాలని కోరారు. ఈ కార్యక్రమంలో మాజీ కార్పొరేటర్లు ధర్మవరపు సుబ్బారావు, వైవి సుబ్బారావు, నాయకులు పడవల కృష్ణమూర్తి, ఉచ్చి భువనేశ్వర ప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.

## జీతాలులేని కమ్యూనిటీ సర్వీస్ ప్రొవైడర్లు!



సమావేశంలో మాట్లాడుతున్న రెహనాబేగం.

నెల్లూరు బాలాజీనగర్‌లోని దామవరపు చెన్నమ్మ భవన్‌లో కమ్యూనిటీ సర్వీస్ ప్రొవైడర్ల సమావేశం శ్రామిక మహిళ షేక్.రెహనా బేగం అధ్యక్షతన జరిగింది. జిల్లాలోని 916 మంది సిఎస్‌పిలకు రావాల్సిన వేతనాల బకాయిలను వెంటనే చెల్లించాలని సమావేశం తీర్మానించింది. ప్రభుత్వ ఆధీనంలోని ఎస్‌బిహెచ్ ద్వారా రావలసిన కోటి రూపాయల్లో దాదాపు 12 లక్షల రూపాయలకు ప్రైవేట్ సీడ్ ఏజెన్సీ వారు బౌన్స్ అయిపోయిన చెక్కులిచ్చారని వారిపై ఇప్పటికీ చర్యలు తీసుకోకుండా ఐకెపి అధికారులు బాధ్యతారాహిత్యంగా ఉన్నారన్నారు. ఇవ్వాల్సిన వేతనం ఇవ్వకుండా సిఎస్‌పిలను రద్దుచేసి వారి స్థానంలో పంచాయితీ సెక్రటరీల ద్వారా పని చేయించుకొంటూ పని భద్రత లేకుండా చేశారన్నారు. ఒక్కో సిఎస్‌పికి 50వేల రూపాయల నుంచి 30వేల రూపాయల వరకు వేతనం రావాల్సి ఉందన్నారు. ఈ సమావేశంలో సిఐటియూ జిల్లా కార్యదర్శి కె.అజయ్‌కుమార్, కె.దొరసానమ్మ, బి.సరస్వతి, డి.చంద్రలత, ఎన్.రజని పాల్గొన్నారు.

## ఆర్టీసిని నిలబెట్టాలి!

● కార్మిక సంఘ నేత ఉప్పాలయ్య సలహా

ఎపిఎస్ ఆర్టీసి కార్మిక్ సంఘ్ బిఎంఎస్ అనుబంధ ట్రేడ్ యూనియన్ కార్మిక సంఘ్ శిక్షణా తరగతులు 8వ తేది టౌన్ హాలులో ఘనంగా జరిగాయి. ముఖ్య అతిథిగా పాల్గొన్న ట్రాన్స్‌పోర్ట్ ఫెడరేషన్ కార్యదర్శి ఉప్పాలయ్య మాట్లాడుతూ కష్టించి ఆర్టీసిని నిలబెట్టవలసిన బాధ్యత అందరిపైనా ఉందన్నారు. ప్రస్తుతం ఆర్టీసి చాలా క్లిష్ట పరిస్థితుల్లో ఉందని దీనిని ప్రభుత్వ




సమావేశంలో మాట్లాడుతున్న కార్మిక నేత ఉప్పాలయ్య.

అధికారులు, కార్మికులు, సూపర్‌వైజర్లు అందరూ కలసికట్టుగా నిలబడి సంస్థను నిలబెట్టాలన్నారు. కార్మిక సంఘ్ ప్రధాన కార్యదర్శి ఆర్.వెంకటరెడ్డి మాట్లాడుతూ ఆర్టీసి 4,200 కోట్ల రూపాయల నష్టాలతో నడుస్తుందన్నారు. ఈ కార్యక్రమంలో కార్మిక సంఘం రాష్ట్ర కార్యదర్శులు డి.మాల్యాద్రి, సి.హెచ్.శ్రీనివాసులు, రీజనల్ కార్యదర్శి ఎం.హరిబాబు అధిక సంఖ్యలో కార్మికులు పాల్గొన్నారు.

## సన్నబియ్యం కోసం నిరీక్షణ

● పంపిణీ కేంద్రాల్లో మోసం



రైతుబజార్లో సన్నబియ్యం కోసం క్యూలో జనం.

సంక్షేమ పథకాలు ప్రవేశపెట్టడం, వాటిని ప్రారంభించే సమయంలో చూపించే చిత్తశుద్ధి, అమలుచేసే విషయంలో ప్రభుత్వంగానీ, అధికారులు గానీ చూపించరు. ఇందుకు ఉదాహరణగా 29 రూపాయలకే సన్నబియ్యం పథకాను పేర్కొనవచ్చు. గత పది రోజుల క్రితం జిల్లాలో 29 రూపాయలకే కిలో సన్న బియ్యం పథకం ప్రారంభమైంది. నెల్లూరు నగరంతోపాటు, కావలి, గూడూరు, పొదలకూరు, నాయుడుపేట తదితర ప్రాంతాల్లో ప్రత్యేక కౌంటర్ల ద్వారా వీటిని విక్రయిస్తున్నారు. పౌరసరఫరాల శాఖ అధికారులు రైస్‌మిల్లర్ల అసోసియేషన్ నేతలతో చర్చలు జరిపి సన్నబియ్యాన్ని 29 రూపాయలకే విక్రయించే విధంగా ఒప్పించారు. బహిరంగ మార్కెట్లో కిలో బియ్యం 35 నుంచి 50 రూపాయల వరకు విక్రయిస్తున్నారు. బియ్యం ధరలను నియంత్రించాలన్న ఉద్దేశంతో అధికారులు ఈ నిర్ణయం తీసుకున్నారు. ఈ నిర్ణయం మంచిదే అయినా బియ్యం విక్రయాలకు సంబంధించి సరైన సిబ్బందిని నియమించక పోవడంతో గంటల తరబడి నిరీక్షించాల్సి వస్తుంది. నెల్లూరు నగరంలో ఫత్తేఖాన్‌పేట రైతు బజారు, నవాబుపేట రైతు బజార్లలో బియ్యం కేంద్రాలు ఏర్పాటు చేస్తున్నట్లు ముందుగా ప్రకటించిన అధికారులు ఆ దిశగా మాత్రం చర్యలు తీసుకోలేక పోయారు. తొలి రోజు నవాబుపేటలో మాత్రమే ఏర్పాటు చేయగలిగారు. పథకం ప్రారంభించిన రెండు రోజుల అనంతరం ఫత్తేఖాన్‌పేట రైతుబజారులో మరో కేంద్రాన్ని జిల్లా జాయింట్ కలెక్టర్ ప్రారంభించడం జరిగింది. సన్న బియ్యం కోసం గుర్తింపు కార్డు తీసుకురావాలన్న నిబంధన విధించారు.

## విశ్వ బ్రాహ్మణుల నిరసన!



నెల్లూరులో నిరసన ప్రదర్శన చేస్తున్న విశ్వబ్రాహ్మణులు.

శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి రచించిన కాలజ్ఞానంపై విమర్శిస్తూ రచనలు రావడం బాధాకరమని విశ్వ బ్రాహ్మణ సేవా సంఘం ఆధ్వర్యంలో నెల్లూరులో ఆందోళన చేపట్టారు. చిన్నబజారు నుంచి ములుమూడి బస్టాండ్, ఎసి సెంటర్, ఆర్.ఆర్.వీధి, కనకమహల్, గాంధీబొమ్మ మీదుగా కలక్టరేట్ వరకు ప్రదర్శన సాగించారు. జడ్పీ మీటింగ్ హాల్‌లో ఉండిన కలెక్టర్‌కు వినతి పత్రం సమర్పించారు. కాలజ్ఞానాన్ని విమర్శించిన రచయిత మల్రి నరసారెడ్డిపై చర్యలు తీసుకోవడంతో పాటు వ్యతిరేకంగా వచ్చిన రచనలను నిషేధించాలని కోరారు.

## ఉపాధి కల్పనపై శ్రద్ధ చూపండి!



సమావేశంలో మాట్లాడుతున్న జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి.

గ్రామీణ ఉపాధి హామీ పథకం క్రింద కూలీలకు అవసరమైన పనులను గుర్తించి వారికి ఉపాధి అవకాశాలు కల్పించేందుకు ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలని జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్‌రెడ్డి కోరారు. జడ్పీ మీటింగ్ హాల్‌లో సంక్షేమ శాఖల అధికారులు, మండల పరిషత్ అధికారులతో గ్రామీణ ఉపాధి హామీ, ఎస్‌హెచ్‌జి బ్యాంక్ లింకేజి, దీపం, ఎస్సీ, ఎస్టీ, బిసి కార్పొరేషన్, వికలాంగులు, మైనార్టీస్ లబ్ధిదారులకు అమలు చేస్తున్న సంక్షేమ పథకాల పనులపై జరిగిన సమీక్షా సమావేశంలో కలెక్టర్ మాట్లాడారు. ఈ సీజన్‌లో వ్యవసాయ కూలీలను గుర్తించి వారికి జాబ్ కార్డులు అందజేయడంతోపాటు తగిన పనులను గుర్తించి సంబంధిత పనుల వివరాలను వారికి తెలియజేసి జరిగేలా చూడాల్సిన బాధ్యత ఎమ్పీడిఓలు, ఎపిడిలు చూడాలన్నారు. ఎస్సీ, ఎస్టీ వర్గాల కూలీలను గుర్తించి జాబ్ కార్డులతో పాటు పనులు కల్పించడంలో ప్రాధాన్యత ఇవ్వాలన్నారు. ఎస్‌హెచ్‌జి బ్యాంక్ లింకేజి క్రింద నిర్దేశించిన లక్ష్యాలను ఫిబ్రవరి నెలాఖరులోగా పూర్తి చేయాలన్నారు. ఎస్సీ, ఎస్టీ, బిసి కార్పొరేషన్ ద్వారా అమలు చేస్తున్న లక్ష్యాలను సాధించడంలో బ్యాంక్ అధికారులు, ఎమ్పీడిఓల సమన్వయంతో పూర్తిచేసి మంజూరు చేసిన యూనిట్లను లబ్ధిదారులకు గ్రౌండింగ్ అయ్యేలా చర్యలు తీసుకోవాలన్నారు. దీపం పథకం కింద అర్హులైన లబ్ధిదారులకు మంజూరు చేసి లక్ష్యాలను పెండింగ్ లేకుండా చూడాలన్నారు.

## ఆధార్ ప్రకటనల్లో అయోమయం!

● ఎప్పట్లో తీసుకోవాలి, కార్డులెప్పుడు వస్తాయో?

కేంద్ర ప్రభుత్వం నగదు బదలీ పథకాన్ని రాష్ట్రంలో ఐదు జిల్లాల్లో ప్రవేశపెట్టింది. ఆధార్ కార్డు అనుసంధానం చేస్తూ సమీప జాతీయ బ్యాంకుల్లో ఖాతాలను ప్రారంభించారు. పథకం ప్రారంభించిన ఐదు జిల్లాల్లో వంద శాతం ఆధార్ కార్డులు లేకపోవడంతో ఈ పథకం ప్రారంభంలోనే సమస్యలు చుట్టుముట్టాయి. ఏప్రెల్ ఒకటి నుంచి నెల్లూరు జిల్లాలో కూడా నగదు బదలీ పథకం అమలు చేయడానికి ప్రభుత్వం ప్రయత్నాలు ప్రారంభించింది. ఈ నేపథ్యంలో ప్రతి ఒక్కరూ ఆధార్ కార్డుకు ఫోటోలు దిగడంతోపాటు బ్యాంకు ఖాతాను కూడా ప్రారంభించాల్సి ఉంటుంది. ఆధార్ కార్డుల కోసం మరికొన్ని కేంద్రాలను ఏర్పాటు చేయాలని అన్ని రాజకీయపక్షాలు డిమాండ్ చేస్తున్నాయి. రేషన్ షాపు డీలర్లు సైతం లబ్ధిదారులు ఆధార్‌కార్డు, బ్యాంకు ఖాతా నెంబర్, వాటి జెరాక్స్ పత్రాలను అందించాలని గ్రామాల్లో డిమాండ్ చేస్తున్నారు. గ్యాస్, రేషన్ సరకులను ఆధార్ కార్డుతో ముడి పెట్టరాదని కలెక్టర్ ప్రకటన చేశారు. అయితే మండల తహశీల్దార్ల ఆదేశాలున్నాయంటూ రేషన్ షాపు డీలర్లు బ్యాంకు ఖాతా వెంటనే ప్రారంభించాలని ఒత్తిడి చేస్తూ నిర్ణీత గడువును విధిస్తున్నారని లబ్ధిదారులు వాపోతున్నారు. తహశీల్దార్లు మాత్రం నోరు మెదపడం లేదు. ఖాతా ప్రారంభించేందుకు అధిక సంఖ్యలో బ్యాంకుల వద్దకు వెళ్లడంతో వారు చేతులెత్తేస్తున్నారు. జీరో బ్యాలెన్స్‌తో ఖాతా ప్రారంభించలేమని చెబుతూ 500 రూపాయలు వసూలు చేయడం కొస మెరుపు.

## నగరంలో భయోత్పాతం

మొదటి పేజీ కొరవ

లోని నగదు, ఇతర వస్తువులు తీసుకొని వెళ్లిపోజూసిన సమయంలో, లీల అనే శకుంతల బంధువు ఆ ఇంటికి వచ్చారట. ఆమె కాలింగ్ బెల్ మోగించ దంతో ఈ ముగ్గురు దుండగులూ లోపలే వుండిపోయారు. ఎంతసేపు తలుపులు కొట్టినా తీయకపోవ దంతో లీల అనే ఆ బంధువు దినకర్‌రెడ్డికి ఫోన్ చేశారట. దానితో ఆయన, తన కాలేజీలోనే పని చేసే ప్రవీణ్‌కుమార్ అనే ప్రొఫెసర్‌ను తోడు తీసుకొని, పరుగెత్తుకొని ఇంటికి వచ్చాడు. ఇంటి వెనుక భాగంలోని తలుపు ద్వారా ప్రవీణ్‌కుమార్ లోపలకు వెళ్లడానికి ప్రయత్నించే సరికి, లోపలున్న ముగ్గురు దుర్మార్గులూ ఆయన మీద కూడా దాడి చేశారు. ఆ వెనుకే వచ్చిన దినకర్‌రెడ్డికి కూడా అదే చేదు అనుభవం ఎదురైంది.

అయితే ఈ గొడవనంతటినీ చూస్తున్న స్థానికులు పెద్ద సంఖ్యలో ఇంటి ముందు గుమికూడారు. ఆ విషయం తెలియని ఇంతియాజ్, దినకర్‌రెడ్డి చనిపోయాడని భావించి, మేడ మీద నుంచి క్రిందకు దూకి తప్పించుకోవడానికి ప్రయత్నం చేశాడు. జనం అతడిని పట్టుకొన్నారు. ఈ లోగా పోలీసు వచ్చి లోపలున్న తతిమా ఇద్దరిని కూడా అదుపులోకి తీసుకొన్నది.

### హంతకుడి కోరిక ఇది!

ఇంతియాజ్‌కు స్వంతంగా డైరీ ఫాం పెట్టుకోవాలని కోరిక అట. దానికి 30లక్షల రూపాయల పెట్టుబడి కావాలి. ఆ డబ్బు దినకర్‌రెడ్డి ఇంట్లో నుంచి దోచుకోవాలని, ఎవరూ లేని సమయంలో శకుంతలను చంపి, దోపిడీ చేస్తే, నగరంలో జరుగుతున్న వరస దొంగతనాల జాబితాలో పడిపోయి తన నేరం బయటపడకుండా వుంటుందని భావించాడట. అనుకోకుండా దినకర్‌రెడ్డి కుమార్తె భార్గవి ఇంట్లో వుండడం, దోపిడీ చేసి బయటపడే సమయంలో వారి బంధువు ఇంటికి రావడం ఆ ముష్కరుల పథకం బెడిసి కొట్టేట్లు చేసింది. దినకర్‌రెడ్డిని కూడా చంపితే తమ గుర్తింపు వెల్లడి కాదనే భావనతో ఆయన మీద కూడా దాడి చేశారు. ఇంటి బయట జనం చేరకుండా వుండి వుంటే వారి పన్నాగం కొంతవరకు ఫలించేదేమో తెలియదు. కానీ అది జరగలేదు.

ఈ దుండగుల దాడిలో తీవ్రంగా గాయపడిన దినకర్‌రెడ్డిని, ప్రొఫెసర్ ప్రవీణ్‌కుమార్‌ను పోలీసులు ఆస్పత్రిలో చేర్పించారు. అప్పటికి ఆయనకు తన భార్య, కుమార్తె చనిపోయారన్న నిజం తెలియదట పాపం. పక్కరోజు వారి అంత్యక్రియలకు ముందుగా ఆయన్ను ఆస్పత్రి నుంచి తీసుకవచ్చి, స్ట్రెచర్ మీద నుంచే వారిద్దరి శవాలను చూపించారు. తన కుటుంబ సభ్యులిద్దరినీ ఒకేసారి పోగొట్టుకొన్న ఆ దురదృష్టవంతుడు కన్నీరు మున్నీరుగా విలపించడం చూసేవారి హృదయాలను కరిగించి వేసింది. పగవాడికి కూడా ఈ పరిస్థితి వద్దురా భగవంతుడా అన్పించింది.

### చదువుల తల్లి భార్గవి

దినకర్‌రెడ్డి కుమార్తె భార్గవి ప్రతిభావంతురాలైన విద్యార్థిని. నారాయణ మెడికల్ కాలేజీలో ఎంబిబిఎస్ చదువుతున్నదా యువతి. ఫస్ట్ ఇయర్ పరీక్షలలో ఆమె యూనివర్శిటీ స్థాయిలో గోల్డ్ మెడల్ కూడా సాధించారట. అంతటి ప్రతిభావంతురాలి జీవితం ఇంత అర్థాంతరంగా ముగిసిపోవడం మనసును కలిచి వేసే విషాదం.

### దారి తప్పుతున్న యువతరం

అక్రమ సంపాదనా వ్యామోహం, అందుకు అడ్డదారులు వెతికే ప్రయత్నం యువతరాన్ని నేరస్తులుగా మారుస్తున్నది. ఇంతియాజ్ వెంట వచ్చిన ఇద్దరు తోడు దొంగలూ, 17 సంవత్సరాలు కూడా పూర్తికాని పిల్లలు. ఇంటర్ చదువుతున్నారు. ఆ వయస్సులో వారిలో అంతటి నేర స్వభావం, ఒకరి వెంట మరొకరిని చంపే క్రూరత్వం, ఇంట్లో రక్తపు మడుగులు కట్టినా చలించకుండా కాపు కాచి మరొక హత్య చేయాలనే ప్రయత్నం చూస్తుంటే ఒళ్లు జలదరించి పోతున్నది. ఈ జంట హత్యోదంతం నెల్లూరు నగరంలో ఒక విధమైన భయోత్పాతాన్ని సృష్టించింది. ఒంటరిగా ఇంట్లో వుండడానికి ఆడవాళ్లు వణికి పోతున్నారు.

ముగ్గురు నేరస్తులూ హత్యా స్థలంలోనే దొరికిపోవడంతో పోలీసుల పని సులువుగా మారింది. నెల రోజుల లోపల వారి మీద అభియోగాలు మోపి, న్యాయవిచారణ మొదలు పెట్టిస్తామని, ఇందుకోసం ఒక ఫాస్ట్ ట్రాక్ కోర్టు ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతామని చెప్పారు ఎస్పీ రమణ కుమార్ గారు.

తమ తోటి విద్యార్థి దారుణ హత్య నారాయణ మెడికల్ కాలేజీ విద్యార్థులను కలచి వేసింది. దీన్ని నిరసిస్తూ, నిందితులను కఠినంగా శిక్షించాలని కోరుతూ నెల్లూరు నగరంలో పెద్ద ప్రదర్శన చేశారు వారు. కలెక్టరేట్, ఎస్పీ ఆఫీసులను ముట్టడించారు. విఆర్ కాలేజీ వద్ద అంగళ్లను మూయించి కొంతసేపు ధర్నా కూడా జరిపారు. నగర ప్రజానీకం మొత్తం వారి ఆందోళనకు మద్దతు పలికింది. చివరకు పోలీసులు కూడా అంగళ్లను మూయిస్తున్న విద్యార్థులను అడ్డుకోకుండా చూస్తూ వుండిపోయారంటే ఈ దారుణ హత్యలు ప్రతి ఒక్కరి మనసులను ఎంతగా కలిచి వేశాయో అర్థం చేసుకోవచ్చు.

## రామనారాయణ

16వ పేజీ కొరవ

చాడు. దానితో రామనారాయణరెడ్డికి వణుకు పుట్టింది. ప్రభాకర్‌రెడ్డి, రాజ్యలక్ష్మమ్మల మీద తీవ్రమైన ఒత్తిడి తెచ్చారు. బేషజం వదలిపెట్టి, తానే స్వయంగా ప్రభాకర్‌రెడ్డి ఇంటికి వెళ్లి మెట్టుకూరు ధనుంజయరెడ్డి చాలా ఖర్చు పెట్టుకొన్నాడని, దయ తలచి అవకాశం ఇవ్వమని బ్రతిమలాడాడు. అయితే ముఖ్యమంత్రి మాత్రం నిశ్శబ్దంగా అభిప్రాయ సేకరణ అనే తంతు పెట్టించాడు. తతిమా జిల్లాలలో వలె స్థానిక మంత్రులు సూచించిన అభ్యర్థిని ప్రకటించకుండా అందరి అభిప్రాయం తనకు తెలపాలని ఇన్‌ఛార్జి మంత్రి పితాని సత్యనారాయణను పురమాయించాడు. కానీ చివరకొచ్చేసరికి అభిప్రాయాలతో నిమిత్తం లేకుండా మెట్టుకూరు ధనుంజయరెడ్డి పేరు ఖరారు చేశాడు.

ఈ నాటకాన్ని నడిపించడంలో ముఖ్యమంత్రి ఉద్దేశ్యం – నెల్లూరు జిల్లాలో ఆనం కుటుంబ ఇష్టారాజ్యం నడవదు అనే సూచన ఇవ్వడంగా కన్పిస్తున్నది. అందుకోసం ప్రభాకర్‌రెడ్డిని, రాజ్యలక్ష్మమ్మ గారిని తెలివిగా వాడుకొన్నాడాయన.

మెట్టుకూరు ధనుంజయరెడ్డికి మరొక సమస్య కూడా వచ్చి పడింది. ఆయన గెలిచిన సొసైటీ కోఆపరేటివ్ బ్యాంక్‌కు చాలా బాకీ వుండడంతో ఓటింగ్ అర్హత కోల్పోయిందని దానితో అంత శ్రమ పడినా ఫలితం దక్కకుండా ప్రమాదం ఏర్పడింది. రామనారాయణరెడ్డి మళ్లీ రంగంలోకి దిగి, ధనుంజయరెడ్డి చేత ఆ సొసైటీ బాకీ వున్న 48లక్షల రూపాయలను ఫిక్స్‌డ్ డిపాజిట్ రూపంలో చెల్లించేట్లు చేసి, అర్హత కల్పించాడు.

కోఆపరేటివ్ ఎన్నిక కోసం లక్షలు, కోట్లు ఇంత ధారాళంగా వ్యయం చేయడం గతంలో ఎప్పుడూ జరగలేదు. తీవ్రమైన పోటీ వుంది, అధ్యక్షులతో శిబిరాలు నడపడం చూశాం మనం. కానీ అసలు పోటీ అనేది లేకుండా చేసుకోవడం ప్రతిపక్ష పార్టీలను కూడా డబ్బుతో టోకున కొనుగోలు చేసే దుష్ట సాంప్రదాయానికి నాంది పలికాడు ఆనం రామనారాయణరెడ్డి. రాజకీయ పదవుల ద్వారా ఉగ్రవుడియంగా కోట్లు దోచుకోవడం వల్ల వచ్చిన అనర్థం ఇది. ఎట్లయితేనేమి, ఆనం రామనారాయణరెడ్డి తన పంతం నెగ్గించుకొన్నాడు. తాను కోరుకొన్న అభ్యర్థిని కో ఆపరేటివ్ బ్యాంక్ ప్రెసిడెంట్‌గా ఎంపిక చేసుకొని, జిల్లాలో తన స్థానాన్ని సుస్థిరం చేసుకొన్నాడు.

## జగన్ అసంతృప్తి

16వ పేజీ కొరవ

మైన క్రియాశీలత్వం కన్పింప చేస్తున్నాడు. నెల్లూరు జిల్లా నేతలను పిలిపించి సమస్య ఎక్కడ మొదలైంది, ఎందువల్ల వచ్చింది అన్న ఆరా తీయడానికి సంకల్పించాడు.

ఇదే సమయంలో తన తల్లి విజయమ్మను మరింత చురుకుగా పార్టీ వాడుకోవాలని కూడా జగన్ ఆదేశించినట్లు తెలుస్తున్నది. జిల్లాలలో సమస్యలు వచ్చినప్పుడు, సంబంధితులను ఆమె వద్దకు రప్పించి, ఎప్పటికప్పుడు పరిస్థితి చక్కదిద్దాలని చెప్పాడట. ఎన్నికల సమయంలో పార్టీలో వర్గాలు ఏర్పడి, కుమ్ములాటలకు దిగడం పార్టీకి చాలా నష్టం తెస్తుందన్న సందేశాన్ని సుబ్బారెడ్డి ద్వారా స్పష్టంగా తెలియజేశాడు జగన్.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

రంగనాయకుల స్వామికి 10వ తేదీ వచ్చిన త్రై అమావాస్య ఎంతో ఇష్టమైనది కావడంతో ఆ రోజు బంగారు గరుడసేవ ఉత్సవాన్ని నిర్వహించారు. తిరుమంజనం, అభిషేక కార్యక్రమాల అనంతరం వేదమంత్రోచ్ఛారణలు, మంగళ వాయిద్యాల నడుమ రంగడు గరుడ వాహనమెక్కి నగర వీధుల్లో విహరించాడు.

### హరనాథపురంలో కోతుల బెడద!

నెల్లూరు హరనాథపురంలోని మూడవ వీధిలో కోతుల బెడదకు స్థానికులు హడలి పోతున్నారు. వేళాపాళా లేకుండా కోతిమూక ఇళ్లపై పడి బయట పెట్టిన వస్తువులు, చెట్లు, చివరికి ఆరేసిన బట్టలు చిందర వందర చేసేస్తున్నాయట. స్థానికులు ఈ విషయాన్ని కార్పొరేషన్ అధికారుల దృష్టికి తీసుకెళ్లినా స్పందించడం లేదంటున్నారు.

### కొమ్మి సమాలోచన

ఆత్మకూరు మాజీ ఎమ్మెల్యే, వైకాపా నేత కొమ్మి లక్ష్మయ్య నాయుడు భవిష్యత్‌లో రాజకీయ కార్యాచరణ, ఎన్నికలలో పోటీ తదితర విషయాలపై అభిమానులు, అనుచరులతో సమావేశం నిర్వహించనున్నారు. ప్రముఖ పుణ్యక్షేత్రమైన పెంచలకోనలో ఫిబ్రవరి 15న జరుగనున్న ఈ సమాలోచన కొమ్మి రాజకీయ భవితవ్యాన్ని తెలిపేవిగా ఉండబోతున్నాయి. వచ్చే ఎన్నికలలో వెంకటగిరి నుంచి పోటీ చేయాలని భావిస్తున్న కొమ్మి అందుకు తగినట్లు కలువాయి మండలంలోని తన అనుచరగణం, సామాజికవర్గం వారు, అభిమానులను కలుపుకొని తన మనసులోని మాటను బయట పెట్టి లక్ష్మీ నరసింహస్వామి ఆశీస్సులతో కార్యక్రమాలు నిర్వహించేందుకు సమాయత్తం అవుతున్నట్లు సమాచారం.

### మంటల మధ్య నిలబడి నిరసన!

విద్యుత్ సర్ ఛార్జీలకు నిరసనగా తెలుగుదేశం పార్టీ కార్యకర్తలు మంటల మధ్య నిలబడి సెగ తట్టుకోలేక పోతున్నామంటూ నిరసన వ్యక్తం చేయడం జనాన్ని బాగా ఆకర్షించింది. ఈ కార్యక్రమాన్ని కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి రూపొందించగా పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర హాజరై రక్తి కట్టించారు.

### విశ్రాంత పోలీసు అధికారుల సంఘం

విశ్రాంత పోలీసు అధికారులు 10వ తేది నెల్లూరు పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లోని ఉమేష్‌చంద్ర మీటింగ్ హాల్‌లో సమావేశమై సంఘాన్ని ఏర్పాటు చేసుకొన్నారు. ఈ సంఘం అధ్యక్షునిగా రిటైర్డ్ ఎఎస్పీ కె.వీరారెడ్డి, ఉపాధ్యక్షునిగా అంజూరి రాధ, కార్యదర్శిగా శ్రీహరిరావు, కోశాధికారిగా జేసుదాసుతో పాటు మరో 20 మంది కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకొన్నారు.

### వైభవంగా త్రై అమావాస్య పూజలు

నగరంలోని వివిధ ఆలయాల్లో త్రై అమావాస్యను పురస్కరించుకొని వైభవంగా పూజలు నిర్వహించారు. వేమాలశెట్టి బావి వద్దగల వైద్య వీర రాఘవ స్వామి ఆలయంలో ప్రత్యేక పూజలు జరిగాయి. భక్తులు అధిక సంఖ్యలో పాల్గొని బెల్లం, ఉప్పు, మిరియాలు ఆలయం వద్దగల బావిలో వేసి మొక్కులు తీర్చుకున్నారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

గ్రంధాలయ సంస్థ ఛైర్మన్, కార్యదర్శి ఈ గ్రంధాలయం తీసేందుకు చర్యలు తీసుకోమనవి.

ఆర్.వెంకయ్య విడవలూరు

### లేక్‌వ్యూ కాలనీలో కోతుల బెడద!

నెల్లూరు పొదలకూరు రోడ్డు లేక్‌వ్యూ కాలనీలోని 8, 9, 10 వీధుల్లో కోతుల బెడద ఎక్కువగా ఉంది. 20కి పైగా కోతులు ఇళ్లపై పడి ఆహార వస్తువులు ఎత్తుకెళ్లడం, పూలచెట్లు, పెరటిలోని అరటిచెట్లలను నాశనం చేస్తున్నాయి. ఆరేసిన బట్టలు తొక్కేస్తున్నాయి. కొళాయిలను తిప్పి ట్యాంకులలో నీళ్లు ఖాళీ అయ్యేటట్లు చేస్తున్నాయి. కార్పొరేషన్ అధికారులు గతంలో కోతులను, కుక్కలను పట్టి అడవుల్లో విడిచిపెట్టేవారు. ఎందువల్లో ఆ పని చేయడం లేదు. ప్రజలు పడే ఏ బాధ తీర్చలేని కార్పొరేషన్‌కు ఏడాదికి రెండుసార్లు మాత్రం పన్నులు చెల్లించాలి. ఇదేం ధర్మం కమిషనర్‌గారు?

ఎం.శ్రీనివాసరావు నెల్లూరు

## పదరంగం -55

నిర్వహణ : బాబాజీ

| 1 |  | 2 | ■ | 3 |  | 4 | ■ | 5 | 6 |
|---|---|---|---|---|---|---|---|---|---|
|  | ■ | 7 |  |  | ■ | 8 | 9 |  |  |
|  | ■ |  | ■ | 10 |  |  |  |  | ■ |
| 11 | 12 | ■ | 13 |  | ■ | ■ |  | ■ | 14 |
| ■ |  | ■ |  | ■ | 15 | 16 | ■ | 17 |  |
| 18 |  | 19 | ■ | 20 |  |  |  |  | ■ |
| 21 |  |  |  |  | ■ |  | ■ | ■ | 22 |
|  | ■ | ■ | ■ | 23 | 24 | ■ | ■ | 25 |  |
| 26 |  | 27 |  | ■ | 28 |  | 29 | ■ |  |
|  | ■ |  | ■ | 30 |  | ■ | 31 |  |  |

**అడ్డం**

1. ఇంతక్రితం (3)
3. యాత్ర ప్రకృతి, వికృతి ? (3)
5. అటునుంచి సత్తువ, బలం (2)
7. అనారోగ్యం (3)
8. ఆపదలు (4)
10. జైలు ఊచలు (5)
11. మోము, ఫేస్ (2)
13. స్త్రీలు నోచేది, చంద్రకళ పాము సినిమా (2)
15. కౌపీనం (2)
17. నీటిలో ప్రయాణ సాధనం (2)
18. వంద, నూరు (3)
20. శ్రీకృష్ణుని సోదరుడు (5)
21. దేముడి గుడే కాని అది రాముడిది (5)
23. అటునుంచి తల్లిగారు (2)
25. బాలిక, త్రిపుర సుందరి (2)
26. వెంగమాంబ ఇంటిపేరు (4)
28. రక్తం (3)
30. తెలుగు పర్సంటేజి (2)
31. రోజా పువ్వు (3)

**నిలువు**

1. యాదవ కుల వినాశనానికి పుట్టిన రోకలి (4)
2. కీటకం (3)
3. భవిష్యత్తు (4)
4. కంచుకం, జాకెట్టు (3)
5. దీపారాధనకు వాడే పత్తి పోగులు (3)
6. ఒక చేను కాదు చాలా పొలాలు (2)
9. దీపావళి టపాసుకి ఇంకో పేరు (3)
12. ఖండించబడిన (4)
13. ముఖ ద్వారము (2)
14. వ్యామోహం, 'యా' తో మొదలు (2)
15. అల్లరి (2)
16. విసుగు, పరాకు కాదు (3)
17. ఈరోజు కాదు ఆనాడు (2)
18. బాణం దెబ్బ (5)
19. తెలుగు నాట్ (2)
20. ఈ పూజ అంటే కర్రతో కొట్టడం (3)
22. క్రింద నుంచి పిల్లి, మార్జాలం (4)
24. వాయువు, గాలి (3)
27. కంఠం, తెలుగు నెక్ (2)
29. తెలుగు కలర్ (2)

**సమాధానాలు**

## పదరంగం -54

| 1ప | సి | 2డి | ■ | 3కు | బు | 4స | ము | ■ | 5శి | 6ల |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రా | ■ | 7ము | ది | త | ■ | ర్దు | ■ | 8కొ | ర | వ |
| గం | ■ | ట | ■ | 9ర్క | లా | బా | ■ | 10డు | ము | కు |
| ■ | 11కా | పీ | 12న | ము | ■ | టు | ■ | కు | ■ | శు |
| 13ఆ | లు | ■ | లు | ■ | 14కం | ■ | 15త్రీ | ■ | 16చే | లు |
| మ | ■ | 17వి | పు | 18ల | ■ | 19శ్రీ | ■ | 20వ | రి | ■ |
| 21ని | 22ము | షం | ■ | క్ష్మ | ■ | ■ | 23చు | ర | క | 24లు |
| ■ | దు | ■ | 25క | ణు | 26పు | ■ | ■ | క | ■ | ము |
| 27న | స | ■ | 28న | డు | మ | ■ | 29ప | ట్నం | ■ | ల |
| 30గా | లి | ■ | క | ■ | లు | ■ | శు | ■ | 31పా | క |
| రా | ■ | 32కా | పు | రం | ■ | 33పా | వు | ర | ము | ■ |

# సంక్షిప్త సింహపురి

## సర్‌ఛార్జీలు తీసి వేయండి!

ప్రస్తుతం విద్యుత్ బిల్లులపై విధిస్తున్న సర్‌ఛార్జీలను వెంటనే రద్దు చేయాలని సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్, ట్రాన్స్‌కో ఎస్ఇ నందకుమార్‌కు వినతిపత్రం సమర్పించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ప్రభుత్వంతో చేసుకొన్న ఒప్పందం ప్రకారం రిలయన్స్ సంస్థ విద్యుత్ ఉత్పత్తి చేయకపోవడంతోపాటు రాష్ట్రానికి ఇవ్వాల్సిన కోటా పూర్తిగా నిలిపివేసిందన్నారు. బొగ్గు కేటాయింపుల విషయంలో ప్రభుత్వం తీరు సరిగ్గా లేదన్నారు. ప్రభుత్వ ఆధీనంలో ఉండాల్సిన బొగ్గు గనులను ప్రైవేటు సంస్థలకు అప్పగించడంతో, వారు కృతిమ కొరత సృష్టిస్తున్నార న్నారు. గ్యాస్, బొగ్గు నిల్వలను పెంచి విద్యుత్ కొరత లేకుండా చూడాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉందన్నారు. సర్‌ఛార్జీలను రద్దు చేయడంతోపాటు వ్యవసాయానికి 9గంటలపాటు విద్యుత్‌ను అందించాలని రాజగోపాల్ కోరారు. సిపిఎం నగర కార్యదర్శి మాదాల వెంకటేశ్వర్లు కూడా ఎస్ఇను కలసిన వారిలో ఉన్నారు.

## ఉచిత వైద్య శిబిరం



సింహపురి స్వర్ణకార సంఘం, ఎన్.ఎం.డి చారిటీస్ సంయుక్త యాజమాన్యాన 7వతేది జెండా వీధిలో ఉచిత వైద్య శిబిరం జరిగింది. నారాయణ జనరల్ ఆసుపత్రికి చెందిన వైద్యులు ఓపిగ్గా వందలాది మంది స్వర్ణకారులను పరీక్షించి మందులు అందించారు. ఈ కార్యక్రమంలో ఎన్ఎండి చారిటీస్ సంస్థ అధ్యక్షుడు నిజాముద్దీన్, సింహపురి స్వర్ణకార సంఘం అధ్యక్షుడు రియాజ్, హఫీజ్, ఉమర్, ఉస్మాన్, షానవాజ్, జహీర్, ఖలీద్ తదితరులు పాల్గొన్నారు.

## నెల్లూరోళ్లకు ప్రస్తుతం ఆధార్ అక్కరలేదు!



నెల్లూరు జిల్లా ప్రజలకు ప్రస్తుతం ఆధార్‌కార్డు సమస్య లేదని, దీనిపై ఆందోళన చెందాల్సిన అవసరం లేదని కలెక్టర్ బి.శ్రీధర్ రెడ్డి స్పష్టం చేశారు. జడ్పీ మీటింగ్ హాల్‌లో 7వతేది విలేకరులతో మాట్లాడారు. నగదు బదలీ పథకానికి రాష్ట్రంలో ప్రైవేట్ ప్రాజెక్టు క్రింద ఏడు జిల్లాలను ఎంపిక చేశారు. వీటిలో నెల్లూరు లేదన్నారు. ఏప్రెల్‌లో మన జిల్లాలో ఈ పథకం అమలుకు ప్రయత్నాలు జరగవచ్చు. అప్పటిలోగా జిల్లాలో మరిన్ని ఆధార్ కేంద్రాలు పెట్టి అందరికీ కార్డులు అందేలా చేస్తామన్నారు. ఎవరైనా గ్యాస్ ఏజన్సీలు, రేషన్ దుకాణదారులు ఆధార్‌కార్డులు అడిగి భయపెడితే జాయింట్ కలెక్టర్‌కు ఫిర్యాదు చేయండి. ఆయన వారిపై చర్యలు తీసుకొంటారన్నారు. కాబట్టి నెల్లూరీయులు ఆధార్‌కార్డుపై అదుర్దా చెందాల్సిన అవసరం లేదు.

## రాష్ట్రంలో రోడ్డు ప్రమాదాలు ఎక్కువ!



భారత దేశంలో నమోదవుతున్న రోడ్డు ప్రమాదాల్లో 55శాతం ఆంధ్రప్రదేశ్‌తోపాటు మరో నాలుగు రాష్ట్రాలలోనే జరుగుతున్నాయని అడిషనల్ డిజిపి సత్యనారాయణ చెప్పారు. 7వతేది పోలీస్ పెరేడ్ గ్రౌండ్‌లోని ఉమేష్‌చంద్ర సమావేశ మందిరంలో విలేకరులతో మాట్లాడారు. 2010వ సంవత్సరంలో మనరాష్ట్రంలో 15,284, 2011లో 15,165, 2012 14,800 రోడ్డు ప్రమాదాలు జరిగాయన్నారు. డిజిపి దినేష్‌రెడ్డి రోడ్డు భద్రతపై ప్రత్యేక దృష్టి పెట్టడం వల్ల గత ఏడాది రోడ్డు ప్రమాదాలు కొద్దిగా తగ్గాయన్నారు. మితిమీరిన వేగం, తాగి వాహనాలు నడపడం, ఓవర్ లోడ్ కారణంగానే ప్రమాదాలు జరుగుతున్నాయన్నారు. రోడ్డు ప్రమాదాల తీరును బట్టి డ్రైవర్‌పై హత్యకేసు నమోదు చేసేందుకు అవకాశం ఉందని, ఈ విధంగా కూడ చట్టం రూపొందిస్తున్నామన్నారు. సమావేశంలో ఎస్పీ బి.వి.రమణకుమార్, ఒంగోలు ఎస్పీ రఘురామిరెడ్డి, ఎఎస్పీలు ఎల్టీ చంద్రశేఖర్, ఏ.సి. నాగేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు.

## సన్న బియ్యం పంపిణీ!



ప్రస్తుతం మార్కెట్‌లో పెరిగిపోయిన బియ్యం ధరలు తగ్గేంత వరకు సన్న బియ్యాన్ని కిలో 29 రూపాయలకు విక్రయిస్తామని జాయింట్ కలెక్టర్ బి.లక్ష్మీకాంతం తెలిపారు. ఫత్తేఖాన్‌పేటలోని రైతు బజారులో ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన కిలో 29 రూపాయల బియ్యం కౌంటర్‌ను 7వతేది ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ అధిక ధరల కారణంగా సామాన్య ప్రజలు బియ్యం కొనలేని స్థితి నెలకొందన్నారు. దీన్ని దృష్టిలో పెట్టుకొని రాష్ట్రంలో ఎక్కడాలేని విధంగా జిల్లాలో 29 రూపాయలకే కిలో బియ్యం అందిస్తున్నామన్నారు. ప్రజలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోమన్నారు. ఈ కార్యక్రమంలో జిల్లా పౌరసరఫరాల శాఖాధికారి ఉమా మహేశ్వరరావు కూడా పాల్గొన్నారు.

**రైతు లోకం**

# వరిలో దోమపోటు - నివారణ!

ప్రస్తుతం మన జిల్లాలో వరిపైరు దుబ్బు చేసే దశ నుంచి కంకి బయటకు వచ్చే దశ వరకు వున్నది. ఈ దశలో సుడిదోమ ఆశించి నట్లయితే పైరు లేత పసుపు రంగులోకి మార్పు చెంది క్రమంగా సుడులు సుడులుగా ఎండిపోతుంది.

### నివారణ

నష్ట పరిమితి పైరు పెరిగే దశలో దుబ్బుకు 10-15 దోమలు లేదా పొట్ట దశ నుంచి దుబ్బుకు 15-20 దోమలు.

దోమ ఆశించినప్పుడు, అప్పుడప్పుడు పొలాన్ని ఆరబెట్టి మరలా పలుచగా నీరు పెట్టాలి.

ఆఖరి దఫా వేసే నత్రజని ఎరువును సిఫారసు మేరకే వేయాలి.

పొటాష్ ఎరువును దుక్కిలో ఒకసారి, మరలా ఆఖరి దఫా నత్రజనితో పాటుగా తప్పక వేయాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

పొలంలో దిగి మొదళ్ల దగ్గర వున్న దోమను గుర్తించాలి. విచక్షణారహితంగా పురుగు మందులు పిచికారీ చేయరాదు.

దోమ ఆశించినప్పుడు ఇమిడాక్లోప్రిడ్ 0.3 మిల్లీలీటర్లు లేదా థయోమిథాక్సామ్ 0.3 గ్రాములు లేదా మోనోక్రోటోఫాస్ 2.2మిల్లీ లీటర్లు లేదా అసిఫేట్ 1.5 గ్రాములు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి.

దోమ ఉధృతంగా వున్నప్పుడు మోనోక్రోటోఫాస్ 2.2మిల్లీలీటర్లు మరియు డైక్లోరోవాస్ 1.0 మిల్లీలీటర్లు లేదా అసిఫేట్ 1.5 గ్రాము మరియు డైక్లోరోవాస్ 1.0 మిల్లీలీటర్లు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేసి, మరలా 4-5 రోజులకు తప్పక మందు మార్చి పిచికారీ చేయాలి.

డైక్లోరోవాస్ మందును ఇతర మందులతో కలిపి పదే పదే పిచికారీ చేయకూడదు.

● రక్తికట్టిన సహకార ఎన్నికల నాటకం

# మెట్టుకూరు ఎంపికతో పంతం నెగ్గించుకొన్న రామనారాయణ!

జిల్లాలో సహకార ఎన్నికల రాజకీయం రసవత్తరంగా ముగిసింది. సాక్షాత్తు ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి ఈ నాటకాన్ని రక్తి కట్టించడం విశేషం.

ఈ ఎన్నికలను ఆర్థికమంత్రి ఆనం రామ నారాయణరెడ్డి ప్రతిష్ఠాత్మకంగా తీసుకొన్నాడు. అటు కాంగ్రెస్ కులపెద్ద నేదురుమల్లి జనార్ధనరెడ్డి, ఇటు తన స్వంత ఇంటి పెద్ద ఆనం వివేకానందరెడ్డి లేకుండా రామనారాయణరెడ్డి స్వంతంగా నడిపిన మొట్టమొదటి రాజకీయ క్రీడ ఇది. దానితో చాలా జాగ్రత్తలు తీసుకొన్నాడు. సొసైటీ స్థాయిలో గెలుపు కోసం అన్ని అడ్డదార్లూ తొక్కాడు. ప్రధాన పోటీ అను కొన్న తెలుగుదేశం పార్టీ నేతలతో రహస్య మంత నాలాడాడు. వీలైనన్ని చోట్ల రాజీలు కుదుర్చుకొన్నాడు. తన ఆత్మీయ కుటుంబానికి చెందిన మెట్టుకూరు ధనుంజయరెడ్డిని రంగంలోకి దింపి ధారాళంగా డబ్బు వెదజల్లాడు. ఒక అంచనా ప్రకారం ఈ ఎన్నికల కోసం ఆయన వెచ్చించిన సొమ్ము 7 కోట్ల రూపాయలు దాటిందట. ఓటర్లను చేర్పించే దగ్గర మొదలుపెట్టి, ఎన్నిక రోజు ఓటుకు నోట్లు పంచడం వరకు ఎక్కడా డబ్బు కొరత అన్నది లేకుండా చూసాడు. ఈ మొత్తం ప్రక్రియలో, ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి ఆయనకు ప్రధాన దళపతిగా పని చేశాడు. వాకాటి నారాయణరెడ్డికి సహకార సంస్థల నిర్వహణలో అనుభవం వుండడం మంత్రిగారికి బాగా కలిసి వచ్చింది. మరొకప్రక్క రాజకీయం కోసం ద్రవ్యాన్ని ద్రవం వలె పారించడంలో కూడా వాకాటి ఘనాపాటి కదా? తన స్వంత డబ్బునే తెంపుగా ఖర్చు పెట్టే అలవాటున్న వాకాటి, తనపై భారం లేని పరిస్థితిలో ఇంకెంత ఉదారంగా వ్యవహరిస్తాడో ప్రత్యేకంగా చెప్పాలా?

మొత్తం 93 సొసైటీలలో 57 గెల్చుకొని తెలుగుదేశం, జగన్ పార్టీల నుంచి కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ అధ్యక్ష పదవికి పోటీ అనేదే లేకుండా చూసుకొన్నారు. అయితే విచిత్రంగా ఆ తర్వాత కాంగ్రెస్ నుంచే అంతర్గతంగా వారికి సమస్యలు ఎదురైనాయి. కోవూరు నియోజకవర్గం రామతీర్థానికి దగ్గరున్న వరిణి గ్రామస్థుడైన సుమంత్‌రెడ్డి అనే యువకుడు, ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి సోదరుడు సంతోష్‌రెడ్డికి స్నేహితుడు. సుమంత్‌ను రాజకీయంగా పెంచాలని గతంలోనే ప్రయత్నం చేశాడు కిరణ్‌కుమార్‌రెడ్డి. కోవూరు ఉపఎన్నికలో అతడి అభ్యర్థిత్వాన్ని తెర మీదకు తెచ్చారు. అప్పుడది వీలు కాలేదు. ఇప్పుడు సహకార ఎన్నికల ద్వారా కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంక్ అధ్యక్షుడిగా ఎంపిక చేయాలనే ఆలోచన ముఖ్యమంత్రికి కల్గినట్లుంది. మొదటే ఆ సూచన ఇచ్చాడాయన. దాన్ని అనుసరించి సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి కొంత ప్రాథమిక కసరత్తు చేశాడు.

కాంగ్రెస్ తరపున గెలిచిన 57మంది సొసైటీ అధ్యక్షులలో 12 మంది నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ గారి స్వంత మనుషులు. గూడూరు డివిజన్‌లో మరొక ఆరేడు మంది సొసైటీ అధ్యక్షులు ఆమెను అనుసరించి వెళ్లే పరిస్థితులున్నాయి. ప్రభాకర్‌రెడ్డికి కూడా దాదాపు ఎనిమిది మంది వున్నారు. మొత్తం అధ్యక్షులలో వీరిద్దరినీ కలిపితే పెద్ద సంఖ్య అవుతుంది. దాన్ని ఆసరాగా తీసుకొని సుమంత్‌రెడ్డి పేరు తెర మీదకు తెచ్చారు. ముఖ్యమంత్రి కూడా మౌనం అర్ధాంగీకారం అన్నట్లు వ్యవహరిం

కొరవ 14వ పేజీలో




## సుబ్బారెడ్డి పట్ల జగన్ అసంతృప్తి!

తన పిన తండ్రి సుబ్బారెడ్డి వ్యవహారశైలి పట్ల వైఎస్ జగన్ తీవ్రమైన అసంతృప్తి వ్యక్తం చేసినట్లు తెలుస్తున్నది. సుబ్బారెడ్డిని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కేంద్ర కమిటీలో కీలక సభ్యుడిగా నియమించారు. తన తర్వాత పార్టీ పెద్దరికం ఆయనదే అన్న భావన కార్యకర్తలలో కల్పించాడు. కానీ అంత బరువైన బాధ్యత అప్పగిస్తే అందుకు తగిన విధంగా ఆయన పని తీరు లేదన్నది జగన్ ఆవేదన. రాష్ట్రంలోని పలు జిల్లాలలో, మరీ ముఖ్యంగా నెల్లూరు, ఖమ్మం, విశాఖపట్నం వంటి జిల్లాలలో వర్గపోరు పెరిగి పోవడం, పార్టీ పరంగా దాన్ని అదుపు చేసే ప్రయత్నం జరగక పోవడాన్ని జగన్ తప్పు పట్టాడట. కనీసం ఈ పరిస్థితి ఎందువల్ల వచ్చిందో కూడా తెలుసుకోలేని అయోమయం ఎందువల్ల అని గట్టిగా ప్రశ్నించాడట. రాజకీయ వ్యవహారాల కమిటీలో భాగస్వాములైన కొణతాల రామకృష్ణ వంటి వారు పార్టీ వ్యవహారాల పట్ల అన్యమనస్కంగా ఉండడం కూడా ఆందోళన కలిగిస్తున్నదని తన పినతండ్రికి చెప్పాడట జగన్. పరామర్శ కోసం జైలుకు వెళ్లిన సుబ్బారెడ్డి ఈ తలంటు ఎదుర్కొన్నాడు. దానితో ఆయన గత వారం రోజులుగా పార్టీ వ్యవహారాలలో ఇదివరకటి కంటే అధిక

కొరవ 14వ పేజీలో







Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com